మిగిలిన తెల్లదనాలని మైమరపించే స్వచ్ఛమయిన తెల్లదనం యిచ్చే స్కోర్—నీలం డిటర్జెంట్ బిళ్ల ప్రకాశవంతమయిన తెలుపు. తెల్లని తెలుపు, సాటిలేని తెలుపు! స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్ల మీ దుస్తుల మురికిని పోగొట్టి వాటికి పరిశుభ్రమయిన తెలుపుని యిస్తుంది. స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్లతో ఎన్నో బట్టలు ఉతకవచ్చు. ఎంతో తెల్లగా. రంగు దుస్తులకి కూడా మెరుపుతనం తెస్తుంది.

**విజయ సాధనలో**
**తళ తళ మెరిసే తెలుపు!**

# స్కోర్

**నీలం డిటర్జెంట్ బిళ్ల**

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిడ్.
(ఒక ప్రభుత్వ సంస్థ)




**విజయ సాధనలో**
**తళ తళ మెరిసే తెలుపు!**

FDS KSDC 3022A TEL




# మీ కుమార్తె పెళ్ళిరోజు మీకూ సంతోషకరమైన రోజు కావాలి.

## అందుకు మీరేం జాగ్రత్త చేస్తున్నారు?

ఐ ఓ బి వారి ప్రత్యేకమైన "వెడ్డింగ్ డిపాజిట్" పథకం ద్వారా - ఒక పద్ధతిలో, క్రమంగా, శ్రమపడకుండా డబ్బు కూడబెట్టే అవకాశం వుంది. మీ కుమార్తె పెళ్ళికోసం ఈ పథకం ప్రారంభించండి.

డిపాజిట్ కాలవ్యవధి-63, 84, 120 నెలలు. నెలసరి 5 రూ.గాని, దాని రెట్టింపులతోగాని ప్రారంభించి, మీ రాబడి పెరుగుతున్నట్టుగానే - యీ మొత్తాన్ని యిబ్బంది పడకుండా పెంచ వచ్చును. నిల్వకాలం పూర్తి కాగానే సరిగ్గా మీకు డబ్బు అవసరం అయినప్పుడు మంచి వడ్డీతో సహా మీ మొత్తం మీ చేతికి అందుతుంది.

ఐఓబికి రండి.
మీకోసం మా దగ్గర చాలా పథకాలున్నాయి.



**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**
మీ ఔన్నత్యాన్నికోరే ఉత్తమ మిత్రుడు

IOB-108A/79-Tel

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 25-7-'80
రవుద్రనామ సం. ఆషాఢ శు. త్రయోదశి
సంపుటము 73 : సంచిక 48

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# ఉత్తరాలు



## ముఖచిత్రం

ఈ వారం 27—6—80 ప్రచురించిన నటి వనిత ముఖచిత్రం పత్రిక స్టాండర్డ్‌ను దిగజార్చేదిగా ఉందని తెలియజేయుటకు విచారిస్తున్నాము. ఈ వారం కేవలం ఒకే ఒక్క కథతోనే సరిపెట్టేశారు. ఈ పద్ధతేం బాగాలేదు సార్. కనీసం మూడు, నాలుగు కథలయినా ఉంటేనేగాని ఇక ముందు పత్రిక చదివేది లేదు సార్. ఏమంటారు? ఒకే కథ అయినా గురివింద కథ బాగుంది. శీర్షికలలో మొదటిది ధర్మపథం శీర్షిక. ఈ వారం మోక్ష సాధనముల గురించి బాగా వ్రాశారు. బులుసు వేంకట రమణయ్యగారికి మా కృతజ్ఞతలు.

టి.వి. శ్రీనివాసరావు, టి. సత్యప్రసాద్ [అండలూరు]

## కథలు

'రతి' ముఖ చిత్రం రమణీయంగా ఉంది. సీరియల్స్ చాలా ఉత్సుకతను కలిగిస్తున్నాయి. ఫీచర్స్, ముఖ్యంగా ధర్మపథం, ప్రశ్నావళి మమ్మల్ని ఆకట్టు కుంటున్నాయి. ఈవారం కథలు "డైరీలో వో కొత్త పేజీ", "పాపం! వీరాజు" చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉన్నాయి. వీరాజు లాంటి హీరో [?] లు ఎందరో నేడు దర్శన మిస్తుంటారు. ఇంకా విశ్వం, జానకి, చలం....ల పాత్రలు నేటి సమాజంలో అడుగడుగునా కనిపించే మనుషులకు ఉదాహరణలు.

కె. అశోక్ కుమార్, దీపా [జడ్‌చర్ల]

*   *   *

వర్ధమాన నటి వనిత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఎక్కువ కథలు లేనందున కాస్త నిరుత్సాహాన్ని కల్గించింది. గురివింద కథలో దొంగతనంగా విస్కీ త్రాగిన రాజు తన తప్పును ఒప్పుకుని, తన పొరబాటుకు క్షమించమని మోహినిగారిని ప్రాధేయపడటం, అసహజంగా ఉంది. [కళ్లు తిరిగిపోతున్నవాడికి అంత సేపు మోహినిగారితో మాట్లాడడానికి వోపిక ఎలా వచ్చిందో మరి!] టేకి శ్రీరామమూర్తి [కోరాపుట్]

*   *   *

ఈ వారం పత్రిక గెటప్ చాలా బాగుంది కథలు రెండిటిలో పాపం! వీరాజు కథ ఎక్స్‌లెంట్‌గా వుంది. రెండో కథ బాగాలేదు. కార్టూన్స్ కాకర పువ్వొత్తులలాగా వున్నాయి. కథలు చాలా తక్కువగా వేస్తున్నారు. కవితలు వేడివేడి మిరపకాయ బజ్జీల్లాగా వున్నాయి. బొమ్మలు ప్రింటు బాగుంటోంది.

టి. వి. యల్. నరసింహారావు, కలిదిండి సాంబశివరావు [గుంటూరు]

లోకంపోకడ ✱ డేవియెన్

నాపై స్వారీకి వస్తారా?

?

చైనా

జబ్బు చేసింది ప్రైవేటు డాక్టరు దగ్గిరి కెళ్లడానికి డబ్బుల్లేవు బ్రతకాలని ఉంది కాబట్టి ప్రభుత్వాసుపత్రికి వెళ్లను.

భారత్-రష్యా మైత్రి ఒప్పందం

ముంచివేసే ప్రయత్నం

పాతమిత్రులిద్దరూ మళ్లీ చేతులు కలిపి నట్లున్నారే?

స్త్రీలపై అత్యాచారాలు చేసిన వారిని తక్షణం శిక్షించాలని కోరుతున్నాం

బాగ్‌పట్ పోలీసు దౌర్జన్యం నశించాలి.



# సామాన్యుని సణుగుడు

## ఎగురుతున్న ఆర్టిసి ఛార్జిలు!

ప్రభుత్వ సంస్థలతో నువ్వా నేనా? అని పోటీపడి ధరలు పెంచేస్తున్నదెవరయ్యా? అంటే– దీనికి వెంటనే జవాబు యింకెవరయ్యా! వారు, మన "సర్కారు" వారేనని మెడమీద తలకాయ వున్న మామూలు మనుషులంతా అంటున్నారు!

రైలెక్కాలంటే భయంగా ఉంది... అది దారిలో పడిపోతుంది అని కాదు, జేబు ఖాళీ అయిపోతుందే అని... యిప్పుడు ఆర్ టీ సి. బస్సెక్కాలంటే గుండెలు అదురుతున్నాయి! ఏ దోవలో ఆగిపోతాయన్న శరా మామూలే. అందుక్కాదు, జేబు ఖాళీ ఐపోవడమే గదు- అప్పుకూడా చెయ్యాల్సి వస్తుంది!

ఏలినవారు యింకా మొన్న అక్టోబర్ నెలలోనే బస్ ఛార్జీలు పెంచేశారు! ఇప్పుడు వాటిని–ఆకాశంలోకి ఎగరేశారు!

సర్కారు యంత్రాంగాన్ని త్రిప్పే బడా ఆఫీసులు, ప్రజానాయకులు. ధరలు పెరిగిపోతున్నాయి, ధరలు పెరిగిపోతున్నాయి– వీటికి కారణం దుకాణదారులు, ఉత్పత్తిదారుల–బ్లాక్‌మార్కెట్ దారులు– దొంగ విల్వల దారులు–అంటూ ఎన్నో "దారుల" యేకరువు పెడుతూంటారు. అవి అనగా సదరు ధరలు– పెరగటానికి యిన్ని మాయదారి దారులు వుండగా యివన్నీ చాలకనా– గవర్నమెంటు వారు ఆర్టీసీ "దారుల" ద్వారా సామాన్య మానవుని నుక్కుపిండేయడం? అసలు యింగ్లీష్ "మీడియం"లో చెప్పాలంటే "గవర్నమెంటు"వారు యెందులో "ముక్కు" పెడితే అందులోనే ధరల విషయంలో ఏకపక్ష నిర్ణయాలు తీసుకుంటూ ఉంటారన్నది జగద్విదితమైన సత్యరాజము! తెలుగు మాధ్యమంలో చెప్పాలంటే – ఏలినవారు ఏందులో వ్రేలు పెట్టినా, అందులో మామూలు మనిషి "ఓర్పు" అడగక్కరలేకుండా పెద్దపోట్లు గుచ్చేస్తారన్నది – సదుపాయమైనా సరకైనా దొరకదని కూడా "లోకోక్తి!"

ఆర్టీసి రేట్లతో పాటుగా సిటీబస్‌ల రేట్లు–ఆటోరిక్షా ఛార్జీలు కూడా పెరుగుతాయి! పెరగకూడదా? ఏం? కేవలం గవర్నమెంట్ వారికేనా రైలు టిక్కెట్ ధర, తంతి తపాలా సదుపాయాల రేట్లు, బస్ ఛార్జీలు కరెంట్ రేటు – చివరికి "పాల" ధర దాకా అన్నిరేట్లు– అప్పటప్పటి– తమ సిబ్బంది కోసం వాళ్ళ జీతాలకోసం– తమ సంతృప్తి కోసం పెంచే హక్కుందని? అని వ్యాపారస్థులు, పారిశ్రామికులు అడుగుతున్నారు!

ఏవో ఒకసారి – వాన వచ్చినా, వరద వచ్చినా– నీళ్ళు కలిపినా, పిండి కలిపినా నెలంతా పోసి – నెలాఖర్న సగం – లేదా మూడొంతులు డబ్బులు గుచ్చేస్తే – తీసుకుపోయే ధర్మాత్ములు పాలవాళ్ళు – ఏళ్ళ తరబడి ధరలు పెంచని వాళ్ళు కాని వాళ్ళ దగ్గర పాలు కొనుక్కుని పాల వ్యాపారాన్ని "గుత్త"కి తీసుకున్న ప్రభుత్వరంగ సామాన్య సంస్థ మాత్రం– అడపాతడపా పెంచేస్తూంది. రైళ్ళ వాళ్ళని – బస్‌ల రోడు వాళ్ళని – పాలు పితికే వాళ్ళని అన్ని వాళ్ళ వేసయ్యా వొప్పుకున్నాం– ఈ దేశం లో ప్రజలు మాత్రం "వాళ్ళవి" కాదా? – ఎన్ని సౌకర్యాలు చేసినా, ఎన్ని సదుపాయాలు పెట్టినా అన్నియును "అరయన్ వంశంబు నిలుపనే కదా వివాహం" అన్నట్టుగా దౌర్భాగ్య జనం సుఖపడాలనేగా – సర్కార్ వారు చేస్తున్నాం అని చెబుతూంటారు?

మరి యిదేనా "జనసేవ?" ఇదా "ప్రజాసేవ?" ఇదా ధరలను అరికట్టే మార్గం? ఆటో మీద, టాక్సీ మీద "మంచివని" కోసం మామూలు పని కోసం యికమీదట ఏవరేనా ఎక్కగలరా? పెళ్ళవన్నీ చేసేవాళ్ళు మాత్రమే వీటికి రాజపోషకులు కావాలి మరి- టాక్సీ, రిక్షాల వాళ్ళు బేరాలు రాక- చీకటి తప్పుల బేరాలకు యిష్టం లేకపోయినా లొంగిపోవాలి – చూశారా? ఎన్ని ప్రమాదాలున్నాయో? కాని ఆర్టీసీ వ్యవహారం ప్రభుత్వం గుత్తకి తీసుకున్న వ్యాపారం కనుక చెయ్యగలిగేది ఏమీ లేదు- సినిమాహాళ ముందు బోర్డులు చూస్తున్నాంగా ప్రభుత్వం వారు కరెంట్ కోత విధించారు గనుక ఏయిర్ కండిషన్డ్ గాకపోయినా అదేరేటు యిచ్చి సినిమా చూడుడు– మాకు సహకరించుడు– అని. సహకరించి చూస్తున్నామా? లేదా? అట్లాగే యిది సహకరించి ఏడ్వాల్సిందే – ప్రభుత్వం 'అత్తగారు' ప్రజలు, 'కోడళ్ళు' లాగ ఉంది అందోయిలాలు- అలాగే ఉంది మరి! ...

– [ వీరాజీ ]






"ఆగు : ఒక్క క్షణం ఆపు!"

రిక్షా అతను బ్రేక్ వేశాడు. మూర్తి హడావుడిగా దిగుతూనే "నీ దగ్గర పది పైసలు చిల్లరుందా?" అని అడిగాడు. రిక్షా అతని సంజాయిషీలో "లేదు!" అన్న సారాంశాన్ని మాత్రం గ్రహిస్తూ త్వర త్వరగా రోడ్డు పక్కనే ఉన్న సాయి మందిరం పక్కన చెప్పులు విప్పి క్షణం సేపు విగ్రహం వైపు చేతులు జోడించి చూసి తిరిగి రిక్షాలోకి హడావుడిగా ఎక్కాడు.

రిక్షా కదిలింది.

భగవంతుడు విగ్రహాల్లోనే లేడు. అంతటా ఉన్నాడు. ఈ రిక్షాను ఆపిన ఒకటి రెండు నిముషాల వల్ల అవతల రైలు దాటి పోవచ్చు. స్టేషన్లో తనకోసం ఎదురు చూస్తున్న శ్రీమతి, అంతకన్నా బెంగగా ఐదేళ్ళ కొడుకు చిరాకుతో చిందులు వేసుకో వచ్చు. తనకి మరింత ప్రమాదకరమైనది— ఇంతకు క్రితం ముగ్గురూ కలిసి బయలు దేరుతున్న రిక్షాని హఠాత్తుగా దోవలో ఆపి, ఇంట్లో మర్చిపోయిన పెళ్ళి ఫోటో కోసం హడావుడిగా వెనుకకు బయలుదేరాడు. ఆ రిక్షాలో నుంచి దూకేటప్పుడు పై జేబులో ఉన్న ముప్పై రూపాయలు శ్రీమతికి ఇచ్చాడు. ఆవిడ ఆ ముప్పై తీసుకుందో లేదో! తీసుకున్నా జాగ్రత్తగానే ఉంచిందో, లేకపోతే స్టేషన్లో ఎదురు చూస్తూనే "ఏ ముప్పై?" అని ఆశ్చర్యంగా నోరు తెరుస్తుందో అని తనకి బెంగగానే ఉంది.

కానీ తను రిక్షా ఆపాడు. ఆ విగ్రహం చూస్తుంటే — దూకుడుగా ప్రవహిస్తున్న తన ఆలోచనలు ఆగిపోయాయి. రైలు దాటి పోవచ్చు. "ఏ ముప్పై?" అని శ్రీమతి అడగవచ్చు. "అప్పుడే చూసుకుందాం!" అని ప్రశాంతంగా నిర్ణయించుకుని విశ్రాంతిగా ఉండగలిగాడు మూర్తి.

స్టేషన్ వచ్చింది.

రిక్షా నుంచి దూకేసి రెండు రూపాయల కాగితం ఇచ్చాడు మూర్తి. రిక్షా అతడు అర్ధరూపాయి నాణెం ఇచ్చాడు. "చిల్లర లేదా?" అని – అడుగుతూ, ఆ వెంటనే లేదన్న సంగతి జ్ఞాపకం చేసుకుని టిక్కెట్టు ఇచ్చే కౌంటర్ వైపు నడిచాడు మూర్తి.

చిల్లర ఉండి ఉంటే, ఆ రిక్షా అతనిని బాబా రూపంగా భావిస్తూ అదనంగా పది పైసలు ఇచ్చి ఉండేవాడు. చిల్లర లేక పోవడం, బాబా అలిగడమన్న భావం కలిగింది మూర్తికి. ఆ భావం వల్ల మూర్తికి బాబా అంటే చిరాకు కలిగింది.

కానీ—

భగవంతుడు కేవలం సాక్షి. అనంత విశ్వంలో సంభవిస్తున్న ఏ సంఘటనకీ చలించని సాక్షి. ఈ నెల ఖర్చులకి తట్టు కోలేక తాను భగవంతుణ్ణి తిట్టుకుంటున్నా, నోరు మూసుకు సహిస్తున్నా, దక్షిణ ఇచ్చినా, ఇవ్వకపోయినా ఏ సంఘటనా బాబాని తాకదు. తాను ఈ దక్షిణలు ఇచ్చేది బాబా కోసం కాదు. తన కోసం. బాబా స్మరణతో తన మనసుని సంస్కరించుకోవటం కోసం.

కౌంటర్ దగ్గర లలిత కనిపిస్తుంటే, స్టేషన్లో కొడుతున్న గంట వినిపించింది. "నాన్నా! మన పాసెంజర్ వచ్చేసింది!" హడావుడి పడుతున్నాడు కుమార్. తనిచ్చిన ముప్పయి అందిస్తూ "టికెట్స్ తీసుకోండి" అంటోంది లలిత. ఆ డబ్బు భద్రంగా ఉన్నందుకు సంతోషపడే వ్యవధి లేకుండా, మూర్తి టిక్కెట్టు తీసుకున్నాడు.

"ఓవర్ బ్రిడ్జి మీదుగా పోదాం!" అని నసుగుతూనే ఉన్నాడు మూర్తి. "రైలు వెళ్ళిపోతుంది!" అంటూ ఒకటవ నంబరు ప్లాట్ ఫారం దిగేశాడు కుమార్. పట్టాలు దాటి రెండవ నంబరు ప్లాట్ ఫారం మీద ఆగిన రైలు కంపార్ట్మెంట్ మెట్లు ఎక్కటానికి ఉపక్రమించాడు. "వీడికి నేర్పవలసిన తాను వీడు చెప్పినట్లు న డ వ వ ల సి వస్తోంది"— లాంటి భావంతో మూర్తి అనుసరించాడు. "అసలు మనం ఎక్కవలసిన రైలు ఇదేనా?"— సందేహిస్తూనే ఎక్కబోతోంది లలిత. ఆ రైలు పెట్టె మీది బోర్డు వైపు చూసి, ఆ బోర్డు మీద కన్నా కుమార్ నాయకత్వం మీదే ఎక్కువ

## ధర్మపథం

### ఉత్తమావలంబనం

మేలైన ఆధారం దొరికినప్పుడు అధమమైన దానిని విడిచి, ఆ ఉత్తమాన్ని నమ్ముకొని ఉండడం మేలు.

ఒకడు తన గ్రామాన్నుంచి మరొక ఊరు వెళుతున్నాడు. ఏదో అత్యవసర కార్యం ఉన్నందున రాత్రికి రాత్రే బయలు దేరవలసి వచ్చింది. అంధకారమయమై ఉండడంవల్ల దారీ, తెన్నూ తెలియలేదు. అలా పోతూ పోతూ చెట్ల గుంపువల్ల మరీ చీకటిగా ఉన్న మార్గంలో పోతూ దాని పక్కనున్న ఒక పాడు నూతిలో పడ్డాడు. అది అగాధమైనది. అందులో పడిపోతే ప్రాణం పోయేదే! కాని, అదృష్టవశాత్తూ, నూతి లోకి చొచ్చివున్న గట్టి చెట్టు వేరు చేతికి తగిలినందున, అతడు దాన్ని పట్టుకొని ప్రాణం నిలబెట్టుకున్నాడు. కాని పైకి రావడానికి సాధ్యం కాలేదు. అతడు ఆ వృక్షమూలాన్ని పట్టుకొని తెల్లవారే వరకూ గడపవలసి వచ్చింది. ఎవరైనా ఆ మార్గం వెంట వస్తారా? తనను బయటికి తీసి రక్షిస్తారా? అని అతడు ఎదురు చూడ సాగాడు. ఏ అలికిడీ లేదు. తెల్లవారుతూ ఉండగా ఇద్దరు మనుష్యులు మాట్లాడు కుంటూ ఆ వైపు వస్తున్నట్లు అలికిడి అయింది. నూతిలోని వ్యక్తి గొంతుక పెద్ద గొంతుక పెట్టి "నూతిలో పడిన నన్ను రక్షించండి. రక్షించండి" అని అరిచాడు. ఆ అరుపు విని ఆ మనుష్యులు నూతి దగ్గిరికి వచ్చి తొంగి చూశారు. అతని అవస్థ చూసి వారికి జాలి వేసింది. వారిలో ఒకడు పరుగెత్తి పోయి ఎక్కడినుంచో ఒక గట్టి తాడు తెచ్చాడు. ఇద్దరూ ఆ తాడు నూతిలోకి జారవిడిచి దానిని పట్టుకొమ్మని, పట్టుకుంటే తాము వీలగా పైకి లాగుతా మని చెప్పారు. నూతిలో ఉన్న వాడికి చెట్టువేరు పట్టుకొని వుండడమా? తాడు పట్టుకోవడమా అని సందేహం కలిగింది. వాని వాలకం చూసి వాళ్ళు "ఓయీ! నువ్వు తాడు పట్టుకుంటే పైకి రాగలవు. వేరు పట్టుకొంటే అక్కడే వుండిపోతావు. ఆలోచించుకో" అన్నారు. అప్పుడు తెలివి తెచ్చుకొని, తాడు పట్టుకొని బయట పడ్డాడు.

అందువల్ల మేలైన ఆధారం దొరికి నప్పుడు అల్పమైన ఆధారాన్ని విడవడమే మేలు. భగవదనుగ్రహం సంపాదించడానికి పూజలు, జపాలు చేస్తున్న వారికి భగవ త్సాక్షాత్కారం కలిగితే— పూజా పురస్కా రాల పైనే మనస్సు ఉంచడం నిరుపయోగం.

ఈ విషయాన్ని ప్రాజ్ఞులు అంగీకరించే ఉన్నారు. ఏది ముఖ్యమో, ఏది అప్రధానమో స్వయంగా ఆలోచించుకోవాలి.

— బులుసు వేంకటరమణయ్య

---

నమ్మకం ఉంది, అనూ ఎక్కాడు మూర్తి.

క్షణాలమీద కంపార్ట్‌మెంట్ కిటికీల పక్కన ఎదురుగా ఉన్న రెండు సింగిల్ సీట్లు రిజర్వ్ చేశాడు కుమార్. "నాన్నా! నువ్విక్కడ కూర్చో! అమ్మా! నువ్వూ, నేనూ ఈ సీట్ మీద కూర్చుందాం!" తీర్మానిస్తూ కూర్చున్నాడు.

అటూ, ఇటూ కదులుతున్న మనుష్యులతో కల్లోలంగా ఉన్న ఆ కంపార్ట్‌మెంటులో తక్షణ కర్తవ్యాన్ని అంత వెంటనే గుర్తించి లక్ష్యానికి సరైన చోటు గుచ్చుకున్న బాణంలా తోచాడు కుమార్. ఆ సీట్లకి మరెవ్వరితోనూ అనుబంధాలున్న చాయలు లేవు. కుమార్ నాయకత్వాన్ని శంకిస్తూ ఈ సీట్లని జారవిడుచుకునే బదులు, వాడేర్పరచిన ఈ అనుబంధాన్ని పటిష్ఠం చేసుకో వటమే మంచిది మూర్తి, లలిత-కుమార్ నిర్దేశించిన సీట్లలో కూర్చున్నారు. కాదు —కూర్చోబోయారు.

"మీరిక్కడ కూర్చోకూడదు!"

దక్షిణ ఆఫ్రికాలో మొదటి తరగతి రైలు పెట్టెలో నల్లవాడి మీద ఆంక్షలు విధించే తెల్లవాడి గొంతు లాంటి గొంతు.

"ఇది ఆర్. ఎమ్. ఎస్. కంపార్ట్‌మెంట్!"

తాను చేస్తున్న ప్రభుత్వోద్యోగపు ప్రాధాన్యత నరనరాల్లోనూ జీర్ణించిన వ్యక్తిత్వం అది. మరోపొర చర్మంగా మారిన లుంగీ, బనీన్లు దేహానికి తగల వలసిన గాలితోపాటు, మనసులోని కార్య దీక్షని కూడా అడ్డగిస్తూ ఉండటం వల్ల కాబోలు-లుంగీని తొడల మీద సాధ్యమైనంత పైకి మడిచి, మొండాన్ని బనీను నుంచి సాధ్యమైనంత వరకు విముక్తం చేసి పొడవాటి సీటు ముందు గొంతుక్కూర్చుని ఉత్తరాల స్టాంపు మీద అతను సీళ్ళు గుద్దుతున్నాడు. అతను పళ్ళ మధ్య బిగించిన చుట్ట ఆ బాధకి విల విల లాడు తున్నట్లు గుప్పు గుప్పున పొగలు వదులు తోంది.

ఆ మనిషి హఠాత్తుగా కిటికీ వైపు దూసుకు వచ్చాడు. ముగ్గురూ అక్కడి నుంచి జరిగారు.

అతను కిటికీ బయటకు వంగి, తల బాగా వంచి తుప్పున ఉమ్మేశాడు. మరు క్షణంలో నిటారుగా నిలబడి "మీరు అటు వైపు కూర్చోవచ్చు!" అన్నాడు.

మూర్తి అటువైపుగా చూశాడు. ఒక అడుగు ఎత్తున అమర్చిన పోస్టల్ సంచులు ఈ రైలు పెట్టెని రెండు వాటాలుగా విభజించి అటువైపు సగాన్ని మామూలు ప్రయాణీకులకీ, ఇటువైపు సగాన్ని పోస్టల్ సామాన్లకీ, ఉద్యోగులకీ పంచుతున్నాయి.

ముగ్గురూ ఆ సంచుల గోడని దాటుతూ ఉంటే, ఆ సన్నివేశం మీద తెరవేసినట్లు తిరిగి తన పనికి పూనుకున్నాడు పోస్టల్ ఉద్యోగి.

పాసెంజర్ మరో రెండు స్టేషన్లు దాటిన తరువాత, అందరికీ కేటాయించిన బర్త్ వాటాలో తిరిగి కిటికీ పక్క రెండు సింగిల్ సీట్స్ సంపాయించాడు కుమార్. తన సీటులోనుంచి మూర్తికి కనిపిస్తున్న ఆ పోస్టల్ ఉద్యోగి, అతని సహచరులూ, వాళ్ళ కదలికలూ కాలక్షేపానికి అనుకూల మైన దృశ్యంలా ఉన్నాయి.

కిటికీలోనుంచి స్టేషన్ మాస్టర్లనీ, రైల్వే గంటల్నీ, గార్డునీ, జెండాలనూ, సిగ్నల్స్‌నీ, రైలు కదలటం, ఆగటం, క్రాసింగ్ వాటి వెనక తతంగాలనూ చాలా కూలంకషంగా గమనిస్తున్నాడు కుమార్. ఈ విజ్ఞానం రేపు వాడి స్నేహితులతో జరిగే చర్చల్లో ఎంతో అవసరం.

"జీడిపప్! గాంధీగారి జీడిపప్!"-వేరు శనగ పప్పగా అన్నా అతను. పాపలా కలిపిన పప్పుల. పోలిథిన్ పాకెట్స్

లలిత చూపు అతనిమీద నిలవకుండా దాటిపోయింది.

"ఇతను దండయాత్ర చెయ్యటం ఇది మూడోసారి!" అన్నాడు మూర్తి. పూర్తి వైరాగ్యంతో లలిత చిరునవ్వు నవ్వింది. కుమార్ వెనక్కి పోతున్న పొలాలవైపు తిరిగాడు. ట్రైన్ సాయంత్రం అయిదు అయింది. ఆకలి దహిస్తున్నట్లు గుర్తించాడు మూర్తి.

"ఓడిపోవాం! చాలా ఆకలిగా ఉంది" అంటూ రెండు పాకెట్లు కొన్నాడు.

లలిత తీసుకోలేదు. బహుశ ఆ రైలు పెట్టెలో తాము మాత్రమే తినటానికి ఇరుకు కావచ్చు. మూర్తికి మాత్రం ఆ రైలు పెట్టె తన డైనింగ్ రూమ్ కన్నా చాలా హాయిగా ఉంది. మధ్యాహ్నం కాలేజీ నుంచి వచ్చి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నప్పుడు ఎంతకీ తెగని అనేక సమస్యలకల్లోలంతో అతని మనసు రణరంగం లాగా ఉంది.

లలిత పుట్టింటికి వెళ్ళాలి. మిగిలిపోయిన ఆఖరు సంవత్సరపు శ్రావణ మంగళవారం నోములు. వారానికోసారి పుట్టింటికి ప్రయాణం. ఆరు నెలల క్రితం "అత్తవారింటికి దగ్గర ఊరు ట్రాన్స్‌ఫర్ అవుతున్నాను. ఏకైక ఆ దేవుడే దిక్కు సార్!" అని ఒక సాటి లెక్చరర్ ఇచ్చిన దీవన

# అతను నడచినదోవ

చెవుల్లో ఈ వేళలో రొద పెడుతోంది.

తను ఇప్పుడు స్వగ్రామం వెళ్ళి తమ్ముడు సత్యాన్నో, ఆంజనేయనో వెంటబెట్టుకుని గుంటూరు వెళ్ళాలి. పెళ్ళివారితో మాట్లాడాలి. తను కుటుంబంలో పెద్ద కొడుకు. అమ్మా, నాన్నా వయసు మీరుతున్న మనుషులు. కనుక తను వెళ్ళక తప్పదు.

తనూ, లలితా ఇద్దరూ వెడుతున్నారు కనుక కుమార్‌ని తీసుకువెళ్ళాలి. శ్రావణ మంగళవారం నోములు ధర్మమా అని వారానికి మూడు నాలుగు రోజులు అమ్మని విడిచి ఉంటూ ఇప్పటికే చాలా త్యాగం చేస్తున్నాడు. కాలేజీలో చదువుకుంటున్న చెల్లెలు లక్ష్మి మాత్రమే ఇంట్లో ఉంటుంది. వీడి స్కూల్ తుంది వీడిని వచ్చే సంవత్సరం సైనిక్ స్కూల్‌కి పంపాలి. వీడి చదువు గురించి శ్రద్ధ తీసుకునే విశ్రాంతి దొరకటం లేదు. వీడు ప్రయాణాలు మరిగి చదువు చెట్టెక్కిస్తాడేమోనని భయం.

రేపటి నుంచి గురువుగారు యజ్ఞం నిర్వహిస్తున్నారు. ఇటువంటి యజ్ఞంలో పాల్గొనే అవకాశం చాలా అరుదుగా వస్తుంది. నిరంతరం నేను, నా వాళ్ళు, నా బాధ్యతలూ అనుకుంటూ సతమత మయ్యే మనిషి ప్రత్యేకమైన లక్ష్యాలకీ, విలువలకీ బద్ధుడై పోతాడు. ఈ గొడ నుంచి బయట పడి కొద్దికాలం విముక్తుడుగా ఉంటే తనని, తన చుట్టూ ప్రపంచాన్నీ, తన కర్తవ్యాన్నీ కొత్త వెలుగులో మరింత విశాలమైన దృక్పథంతో పరిశీలించుకోవచ్చు. ఇటువంటి ఏకాంత వాసానికీ, మానసిక శుద్ధికీ గురువుగారి యజ్ఞం దోహదం చేస్తుంది.

ఈ యజ్ఞంలో తను పాల్గొంటే, ఈ రోజే తను యజ్ఞానికి బయలుదేరాలి. లక్ష్మి పెళ్ళి సంబంధపు ప్రయత్నం పూర్తిగా సత్యానికో, ఆంజనేయకో అప్పజెప్పాలి. లేదా తాత్కాలికంగా వాయిదా వేసి ఆ తరువాత తనే చూసుకోవాలి. ఖర్చు పెరిగి గంపెడవుతుంది.

యజ్ఞానికి వెళ్ళి వచ్చినందుకు నూట యాభై అవుతుంది. "ఈ ఖర్చువల్ల నేను పొందింది ఏమిటి?" వంటి ఆలోచన ఆ యజ్ఞంలో హోమం కావలసి ఉంటుంది. ఈ ఆలోచనని తాను హోమం చేయగలడా? ఏమో! కానీ లక్ష్మి శ్రేయస్సుకోసం చేస్తున్న ఈ ప్రయత్నం— సఫలమైనా, విఫలమైనా ఇప్పుడు తను చేస్తున్న ఖర్చుకి తను దిగులు పడడు.

[illegible]— తను తలపెట్టిన ఈ నాలుగు రోజుల్లో లక్ష్మి పెళ్ళి సంబంధం కోసం చేసే ప్రయాణాల్లో ఒక భాగంగా తన ఖర్చుని తిరిగి రాబట్టుకునే మార్గం కనుపిస్తోంది. ఈ మార్గాన్ని తాను అనుసరించాలా? వద్దా? అనేది తను తేల్చుకోవాలి.

మూర్తి తాపీగా పాకెట్ విప్పాడు. కుమార్ కొంచెం తీసుకొని వద్దన్నాడు. ఆ పెట్టెలో వేరుశెనగ పప్పులు తినే పిల్లలు ఎవరైనా ఉన్నారేమోనని చూశాడు మూర్తి. లేరని రూఢి చేసుకుని, సాటి జీవరాశి రూపంలో ఉన్న భగవంతుడి కోసం కొన్ని పప్పులు కిటికీలోనుంచి బయటకు విసిరేసి, తినటానికి ఉపక్రమించాడు మూర్తి. అతని మనసులో ఖర్చు రాబట్టుకునే మార్గం తాలూకు ఆలోచనలు పెరుగుతున్నాయి.

ఒకరోజు కాలేజీలో మూర్తి రూమ్‌లో—

"ఎన్ని రూల్స్ అని పాటిస్తాం సార్! అసలు ఏ రూల్ ప్రకారం మనం ఇప్పుడు సరిగా నడవగలం?"— ఆ కంపెనీ ప్రొప్రైటర్ తన వాదాన్ని ఈ దోవలో ఆరంభి



బించాడు. "లేబరేటరీకి ఎక్విప్‌మెంట్ ఖచ్చితమైన గడువులోగా మీరు అందించలేకపోతే ఆ డబ్బు మీరు తిరిగి ప్రభుత్వానికి అప్పజెప్పాలి! ఏవరు తిన్నట్లు?"— ఆ ప్రొప్రయిటర్ క్షణం సేపు ఆగాడు.

మూర్తి మౌనం జూచి ప్రోత్సాహం పుంజుకుని మళ్ళీ అందుకున్నాడు. "మీరు ఇన్ని కంపెనీల నుంచి రేట్లు అడుగుతున్నారు. ఇంత శ్రద్ధ తీసుకుంటున్నారు. ఇన్ని ఫైల్స్ తయారు చేస్తున్నారు. ప్రభుత్వం మీరు తీసుకుంటున్న ఇంతటి శ్రమని ఏమైనా గుర్తిస్తుందా? కానీ అంత తక్కువ ధరలకు పెద్దపెద్ద కంపెనీలు గడువులోగా సప్లై చేయగలుగుతున్నాయా?"

మూర్తి మాట్లాడలేదు.

"ధరలు ఎక్కువ కావచ్చు. మేం తప్పకుండా సప్లై చేస్తాం. మేలైన ఎక్విప్‌మెంట్ ఇస్తాం. పైగా మీరు కాలేజీ కోసం ఇంత శ్రమ పడుతున్నారు మీకూ దీంతో కొంత ప్రయోజనం ఉండటం

## అతను నడచినదోవ

న్యాయం!"

న్యాయాన్ని అంత సునాయాసంగా తేల్చి చెప్పిన ఆ మనిషిని చూస్తూ మూర్తి నవ్వాడు. అతను మాత్రం చిత్తశుద్ధితో తాను చేసిన ధర్మ నిర్ణయాన్ని గంభీరమైన మౌన ముద్రతో బలపరుస్తూ ఊరుకున్నాడు.

అతను చెప్పిన పద్ధతికి అంగీకరిస్తే— ఇన్ని ఫైళ్ళు, ఇంత గందరగోళం ఉండదు. తనకి శ్రమ ఉండదు. పైగా ప్రయోజనం కూడా ఉంటుంది. కానీ ప్రభుత్వం ఇస్తున్న ఆ డబ్బుకి ఈ లేబరేటరీ వృద్ధి అవవలసినంత వృద్ధి కాదు

"నేను మాట ఇవ్వలేను" అన్నాడు మూర్తి.

అతను చిరునవ్వు నవ్వి శలవు తీసుకున్నాడు.

ఇప్పుడు ఈ ఫైలు పెట్టెలో "మాట ఇవ్వవచ్చా?" అని ఆలోచిస్తున్నాడు మూర్తి.

పెళ్ళిళ్ళు కావలసిన చెల్లెళ్ళు, కుటుంబ బాధ్యతలు ఉన్న తను తన శ్రమకి ఇటువంటి "ప్రయోజనాలను" తిరస్కరించటం న్యాయమేనా? అని ఆలోచిస్తున్నాడు.

మూర్తి మనసులో మరో అల లేచింది. సన్నివేశం తల్లితో వాదం.

"దేనికమ్మా ఈ పెళ్ళిళ్ళు? మొగుళ్ళు, వంటిల్లు, పిల్లలు— ఏం కొనుక్కున్నారు? — ఏం చేయించుకున్నారు? — ప్రపంచం ఇంతకు మించకుండా, వీళ్ళ మెదళ్ళకి ఉరి తొడుగులు! ఈ కట్నాలు, పెళ్ళి ఖర్చులూ పెడితే వీళ్ళు హాయిగా చదువుకోలేరూ? వీళ్ళ కాళ్ళమీద వీళ్ళు నిలబడలేరూ? చుట్టూ ప్రపంచాన్ని ఇంతకన్నా బాగా అర్థం చేసుకుని, దానికి ఇంతకన్నా బాగా ఉపయోగపడరూ? ఇంతమంది పెద్దవాళ్ళం కలిసి, ఇంత డబ్బు ఖర్చుపెట్టి చైతన్యం లేని ఒక గుదిబండని అప్పజెప్పటానికి బదులు— వీళ్ళంతట వీళ్ళు తమ కాళ్ళమీద నిలబడి, తమ జీవిత భాగస్వాము

లను తెమ్మకోవటం లోకకళ్యాణంకాదూ?'' ఇది తన వాదన.

అమ్మకి తన వాదం మనసుకు పట్టిందో లేదో కాని లక్ష్మి తన దగ్గర ఉండి చదువుకుంటోంది. తన కాళ్ళమీద తను నిలబడే మనిషిగా రూపొందటానికి శాయ శక్తులా కృషి చేస్తోంది.

ఇప్పుడు మామయ్య చెప్పిన ఈ సంబంధం, లక్ష్మి ఇంతకన్నా ఎదగలేక పోవచ్చు. సమాజానికి ఉపయోగపడలేక పోవచ్చు. కానీ తప్పకుండా సుఖపడుతుంది. లక్ష్మి భవిష్యత్తు గురించి తనకి బెంగ వదులుతుంది.

అందుకే ఈ పెళ్ళి ప్రయత్నం కోసం తన గురువుగారి యజ్ఞం వదులుకుంటున్నాడు— యజ్ఞం అనేది స్వార్థాన్ని హోమం చెయ్యటమనీ, దీనివల్ల తనతోపాటు పది మంది శ్రేయస్సుని వర్షించే మేఘాలు ఉద్భవిస్తాయనీ తెలిసి కూడా.

ఏదో అలికిడికి ఆలోచనల నుంచి తేరుకుంటూ పక్కకి తిరిగాడు మూర్తి.

అతను. ఇదివరకు ఒకసారి ఏదో ప్రయాణంలో చూశాడు అతనిని. గుడ్డివాడు. భక్తి గీతాలు పాడుతాడు. సాధారణంగా వినిపించే ముష్టివాళ్ళ పాటల్లాగా కాకుండా అతని పాట బాగుంటుంది. అతను మూర్తి సీటు పక్కన ఖాళీ చూసుకుని పాట ఆరంభించబోతున్నాడు.

అలవాటు ప్రకారం జేబులోనుంచి ఐదు పైసలుతీసి అతని చేతిలో వేశాడు మూర్తి.

''హల్లో ల్లో!.. నువ్వా!''

హఠాత్తుగా వినిపించిన ఆ కేకకి ఆ అంధుడు ఆరంభించబోయిన పాట ఆగిపోయింది. రైలు పెట్టెలో మనుషులంతా ఆ కేకవైపు తిరిగారు.

పోస్టల్ ఉద్యోగి లుంగీ విగదీసి మడిచి ఉత్సాహంతో ఊగిపోతున్నాడు.

''రా! రా! ... ఇక్కడ కూర్చో! ... ఇందాకటి నుంచి చూస్తున్నా! ఇంకా బండికి రాలేదేమా? అని... చుట్ట కాల్చావా? ఇదుగో చుట్ట! కాల్చు!'' అతనిని బర బర చేయిపట్టుకు లాక్కొచ్చి తనకి కేటాయించిన సీట్లో సుఖాసీనుణ్ణి చేసి జేబులో నుంచి మెరుపులా చుట్ట తీసి అతని నోట్లో పెట్టి వెలిగించాడు.

ఆ గుడ్డి అతను కాకీ నిక్కరూ, పొట్టి చేతుల చొక్కా వేసుకున్నాడు. పెను తుఫాను లాంటి ఈ మన్ననకి తమాయించుకుంటూ ఆ సీటులో నిటారుగా కూర్చున్నాడు. ఆ సీటు — తన వంటి మనుషులు కూర్చునేది కాదని పోస్టల్ ఉద్యోగి ఆంక్ష విధించిన సీటు అని గుర్తించాడు మూర్తి. ఆ సీటులో కూర్చుని ప్రతి నరాన్నీ బిగించి పెట్టి, పళ్ళన్నీ బిగించి పెట్టి నవ్వుతూ తన కళ్ళ పొరల కావల హఠాత్తుగా అలుముకున్న సన్నివేశాన్ని ఆకళించుకుని దానితో నిర్దుష్టమైన సంబంధాన్ని స్థిరపరచుకున్నాడు.

చుట్ట రెండు దమ్ములు లాగి, సర్వాన్నీ విస్మరించినట్టు సీటు మీద జారగిలబడ్డాడు. కాలు మీద కాలు వేసుకుని పొగ పీల్చడం

## స్పందన

నీ జీవితంలో వసంతం విరిస్తే—
కోయిలనై నే పాడతా
ఆ కోయిల పాడే సాహిత్యం—
మన స్నేహపు స్పందనలు
మరి—
నీ జీవితంలో వేసవి ఎదురైతే—
నీ హృదయంలో మల్లెనై విగసిస్తా
ఆ వల్లని మల్లెల ఘుమ ఘుమలు—
మన స్నేహపు స్పందనలు.

—సంజీవి

లోని హాయిలో నిమగ్నుడయ్యాడు. ఆ హాయిలో అతను ముష్టివాడు కాడు. అతనికి ఈ ప్రపంచమూ లేదు. ఉన్నది కేవలం ఆ హాయిని ఇస్తున్న చుట్ట.

''ఇదుగో! నిన్ను ఈరోజు ఈ పెట్టె దాటిపోనివ్వను. ఈ పూట నీ అన్నం నా దగ్గరే. క్యాస్సైన కూర. బెజవాడ వెళ్ళే వరకు నీ పాటలన్నీ వినిపించాలి!''—పోస్టల్ ఉద్యోగి.

పళ్ళన్నీ బయట పెట్టి నవ్వుతూ అతను చుట్ట పూర్తి చేశాడు. అరువది నాలుగు కళలనూ ప్రోత్సహిస్తున్న భోజ మహారాజలా ఆసీనుడయ్యాడు పోస్టల్ ఉద్యోగి.

ఇంతటి పొగడ్తకి గురి అయిన ఈ మనిషి పాడగలడా? పెట్టెలో ఇందరి చూపులు తనకి గిలిగింతలు పెడుతున్నట్టు కదులుతున్న ఈ అపర భోజుడు ఆ పాటని ఆస్వాదించగలడా?— అనిపించింది మూర్తికి.

భోజుణ్ణి గమనిస్తున్న మూర్తి మనసు ఆ అంధుడు ఆరభించిన రాగానికి స్పందించింది. మూర్తి దృష్టి అప్రయత్నంగా ఆ అంధుడి వైపు తిరిగింది. అతను తన సర్వ ప్రపంచాన్నీ ఆ రాగంలో లయం చేసుకుని పాడుతున్నాడు. ఆ రాగం— పెను తుఫాను లాంటి మర్యాదకి చెదరటం బహుశా దానిని తనలో లయం చేసుకుని శ్రోతల మనసుల్ని నిలబెట్టి ఏలుకుంటోంది. ప్రశంసా భావంతో గుడ్డి అతని మీద మూర్తి దృష్టి నిలిచిపోయింది. పరవశత్వంతో పోస్టల్ ఉద్యోగి వేస్తున్న దరువుని అతని చేతితో వారించాడు. అదే ఏకాగ్రతతో పాట పూర్తి చేశాడు.

పాట ముగుస్తూనే, ఆ పెట్టెలో నిశ్శబ్దాన్ని చెదరగొడుతూ పోస్టల్ ఉద్యోగి అందుకున్నాడు— ''కాకినాడ దగ్గర రైలు ఎక్కుతుంటారే... ఒక ముసలి మొగుడూ, పెళ్ళాం— ఆ ముసలివాళ్ళ పాట ఎప్పుడైనా విన్నావా?... అబ్బో! బ్రహ్మాండం!... నువ్వు అతన్ని మించిపోవాలి!''— ఆ గుడ్డి అతను ముఖాన్ని చింపేసుకుంటూ విన్నాడు. ఉద్యోగి ఏదో పాట చెప్పి ''పాడగలవా?'' అని అడిగాడు.

''లేదండీ! నాకు ఘంటసాల పాటలే వచ్చు!''— అన్నాడు అతను వినయంగా. అతనిలో పాటగాడికి లభించిన పొగడ్త వల్ల అహంకారం లేదు. దానిమంచే ఉత్సాహమయ్యే నిరుత్సాహమూ లేదు. తామరాకు మీద నీటిబొట్టుకి ఉండే స్వచ్ఛత ఉంది.

''అయితే అలాగే కానీ! నీకు వచ్చిందే పాడు!''— అని పచ్చజెండా చూపాడు భోజుడు.

అతను అందుకున్న రెండవ పాటకి మూర్తి కళ్ళు మూతబడ్డాయి. తృప్తి చెప్పు కలిగిన హాయికి అవి చెమ్మగిల్లినాయి.

అతను పాడుతున్న పాటని ఎప్పుడూ తను రేడియోలో వింటూనే ఉంటాడు. తన గొడవలో తాను ఉంటూనే వింటాడు. కానీ బహుముఖంగా పరుగులు పెడుతూ ఆయాసపడే తన మనసుకి— ఇప్పుడు అతను స్తుతిస్తున్న తిరుమల మందిర సుందరుడు శివుడో, కేశవుడో, అన్నిటికీ అతీతమైన












# అతను నడచినదోవ

ఆదికొస్తే, అయ్యా— విశ్రాంతిని, శాంతిని ఇస్తున్నాడు.

మూర్తి అతను పాడిన పాటలన్నీ శ్రద్ధతోనూ, భక్తితోనూ విన్నాడు.

ఆ తరువాత ఆ అంధుడు భోజనానికి కూర్చున్నాడు. మూర్తి నిశ్శబ్దంగ లేచాడు. పోస్టల్ సంచుల గోడదాటి వానంగా అర్ధరూపాయి ఇచ్చాడు. పోస్టల్ ఉద్యోగి దానిని అందుకుని గుడ్డి అతని జేబులో వేస్తూ పెద్ద గొంతుతో 'ఇదుగో! ఈ అయ్యగారు అర్ధరూపాయి ఇచ్చారు. అన్నం తిని ఆయన అడిగిన పాటలన్నీ పాడి, పెట్టెలో ఒకసారి తిరుగు ఇచ్చేవాళ్లుంటే ఇస్తారు నువ్వు తిరగకపోతే మానేస్తారు. జాగ్రత్త!'- అని అతనికి అన్నం వడ్డించాడు.

మూర్తి తన అర్ధరూపాయికి లభించిన ప్రచారానికి సిగ్గుపడుతూ తన సీట్లో కూర్చున్నాడు.

అతను భోజనం చేసి, చుట్ట కాల్చుకుని ఒకటి రెండు పాటలు పాడి ఆపేశాడు. పోస్టల్ ఉద్యోగి స్నేహితుల్లో ఒకతను అర్ధరూపాయి, ఒకతను పావలా ఇచ్చారు.

ఆ అంధుడు లేచి నిలబడ్డాడు. రైలు పెట్టెలో ఒకసారి తిరుగుతాడేమో అనుకున్నాడు మూర్తి. కాని అతను అల్లాగే నిలబడ్డాడు. రైలు తరువాత స్టేషన్లో ఆగగానే పోస్టల్ ఉద్యోగులు ఉన్న ద్వారం వైపు నుంచి దిగి వెళ్ళిపోయాడు.

మూర్తి ఆ ద్వారం వైపే చూస్తూ ఉండిపోయాడు.

ఆ స్టేషన్— పనికోసం పట్నం పోబోతున్న కూలిజనంతో కల్లోలంగా ఉంది. మరికొన్ని నిముషాల్లో ఆ రైలు పెట్టెలోకి సాధారణ జనపు దోవలో నుంచి కావడి పెట్టెలూ, గంపలూ, తట్టలూ, మలక మంచాలూ, ముసలివాళ్లూ, మోటుజనమూ యావత్ సమాజమూ తోసుకు వచ్చింది.

మూర్తి వాళ్లు దిగవలసింది ఆ తరువాత స్టేషనే.

"మనం ఇక్కడ దిగుదాం ?" — అయోమయంగా నోరు తెరచి ఆ ద్వారాన్ని చూస్తూ, ఆశగా పోస్టల్ ఉద్యోగుల వైపు ద్వారాన్ని చూస్తూ అడిగింది లలిత.

(40వ పేజీ చూడండి)

# ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

## లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా మీరు ఎదురు చూస్తున్నారు. అదే క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమమైన మంచి ఎగుమతి రకం డస్ట్ టీ రకాలను మేళవించి చిక్కటి కమ్మని టీ కోసం చూచే మీలాంటి వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్ టాప్ స్టార్ కావాలని అడగండి. పూర్తిగా ఫాయిల్‌లోనే ప్యాక్ చేసారు గనుక తాజాగా, చిక్కగా, కమ్మగా మీరు కోరినట్లు వుంటుంది.




LT/CAS-I/77R TEL

**సంతృప్తి నిచ్చే స్ట్రాంగ్ టీ**

# ఉపసంహారం

కొంగుంట రామచంద్రమూర్తి

**జరిగిన కథ – 9 :** చిన్నతనంలోనే తన తల్లిదండ్రులను కోల్పోయి, ఉన్న వూరు వదలి హైదరాబాద్‌లో తన అక్క దగ్గరుంటున్న భానుమూర్తి, ఇల్లు అమ్మకం విషయంమీద తిరిగి ఆ వూరు వస్తాడు. అక్కడి ప్రదేశాలను చూస్తుంటే అతనికి గతస్మృతులు జ్ఞప్తికి వస్తూంటాయి. భానుమూర్తిని కరణంగారి అమ్మాయి సుధ పెళ్ళి చేసుకోమని అడుగగా, తనకా అర్హత కలిగినప్పుడు తప్పకుండా చేసుకొంటానని సమాధానమిస్తాడు. భానుమూర్తి తల్లిదండ్రులు పోయిన తరువాత అతని బాధ్యతను, అక్క జానకికి ఇష్టంలేకపోయినా బావ రాజారాం స్వీకరిస్తాడు. ఓ హత్యకేసులో ఇరుక్కుని జైలుకెళ్ళిన భానుమూర్తికి, అక్కడ జలపతితో పరిచయము అవుతుంది. అతను ఏ కారణాన జైల్లోపడ్డాడో భానుమూర్తికి చెప్తాడు. రాజారాం గుండెపోటుతో మరణిస్తాడు. జైలునుండి విడుదలైన భానుమూర్తి ఆయన అంత్యక్రియలు తానే చేస్తాడు. కొడుకు రాము కోరికమీద జానకి, ఆమె మిగతా పిల్లలతో పూనా వెళ్ళిపోతుంది. భానుమూర్తికి భాస్కర్రావ్‌తో పరిచయమేర్పడుతుంది. అతని సహాయంతో సినిమాలలో చిన్న చిన్న వేషాలు వేస్తూ, జలపతి తల్లిని, చెల్లిని సంరక్షిస్తూంటాడు భానుమూర్తి. జలపతి తల్లి చనిపోయిన తరువాత, అతని చెల్లెలు రాణీని తీసుకొని మద్రాసు చేరుకొంటాడు భానుమూర్తి. అక్కడి డాక్టరు అతనికి 'లెప్రసీ' వ్యాధి సోకిందని చెప్పగా విని భయకంపితుడౌతాడు అతనికి సోకిన కుష్టువ్యాధి తన కంటుకుంటుందేమోనని భయపడి, తన ప్రియుడు మోహన్‌రావ్‌తో లేచిపోయి భానుమూర్తికి ఉత్తరం ద్వారా తెల్పుతుంది రాణీ.

(గత సంచిక తరువాయి)

"కేవలం చెడు తిరుగుళ్ళు తిరిగినంత మాత్రాన, ఈ వ్యాధి రావాలని ఎక్కడుంది మీ పిచ్చిగానీ? ఆ మాట కొస్తే నేనూ మీలాగే విచ్చలవిడిగా తిరిగాను. ఇప్పటికీ, వచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకుంటున్నాను. అసలు నన్నడిగేతే – ఇలాంటి వ్యాధులు వంశ పారం పర్యంగా కూడా వస్తాయంటారు."

"ఔనండీ! డాక్టరుగారు కూడా అలాగే అన్నారు. మా వంశంలో మా ముత్తాత గారికి ఈ వ్యాధి వుండేదట."

"ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నారా?" అడిగాడు భాస్కర్రావ్.

"ట్రీట్‌మెంట్ ప్రారంభించి చాలా కాలం కావస్తోంది. మరో రెండు నెలలు తీసుకున్న తర్వాత – ఇక మానేయాలను కుంటున్నాను."

"ఎందుకని?"

"మందులతో ఈ వ్యాధి నయంకాదనే అనిపిస్తోంది. కొన్ని పుస్తకాల్లో కూడా చదివాను – ఇది దీర్ఘవ్యాధని! తగ్గనిరోగం కోసం డబ్బు ఖర్చు కూడా ఎందుకు చెప్పండి?" నిరాశ ధ్వనించింది భానుమూర్తి మాటల్లో.

భాస్కర్రావ్ ఏమీ మాట్లాడలేదు. ఒకసారి గదంతా పరిశీలనగా చూశాడు.

ఓ ప్రక్కన గాడ్రెజ్ టేబులూ – దానిమీద నాలుగయిదు బైండు పుస్తకాలూ, ఇంగ్లీషు న్యూస్‌పేపరూ వున్నాయి. అక్కడే మరో ప్రక్కన వయొలిన్, రేడియో కూడ కనిపిస్తున్నాయి. గోడలమీద దేవుడిబొమ్మల కేలండర్లూ – ఒకటి రెండు తైలవర్ణ చిత్రాలూ వ్రేలాడుతున్నాయి. వాటిపక్కనే రాణీ ఫోటో కూడా వుంది.

"రాణీ చదువుకుంటోందా?" ఆ ఫోటో లోకి చూస్తూ అడిగాడు.

"కాలేజీ చదువు మానేసి – జీవితాన్ని చదవటానికి వెళ్ళిపోయింది"

భాస్కర్రావ్‌కి అర్థంకాలేదు.

"నా వ్యాధిని చూసి అసహ్యించుకుంది. తనకూ ఇది అంటుకుంటుందని భయపడింది. తనను ప్రేమించి, అభిమానించిన నన్ను కాదని – నాతోకూడా చెప్పకుండా, తాను మోహించిన ఓ మోహనుడితో వెళ్ళి పోయింది..."

"వెళ్ళిపోయిందా?"

"కాదు... లేచిపోయింది"—భానుమూర్తి మాటల్లో కొంచెం కోపం, మరికొంచెం ద్వేషం కలిసిపోయాయి.

"పాపం! మీరొక్కరే వుంటున్నారన్న మాట!"

"అది పాపం కాదు భాస్కర్‌గారూ!... నేనెప్పుడూ ఒంటరిగానే వుండాలని ఆ భగవంతుడు నాకిచ్చిన శాపం."

"మరి పిక్చర్స్‌లో మీరేం ప్రయత్నం చేయటంలేదా?"

"ఈ పరిస్థితిలో నాకసలు వీధిలోకి వెళ్ళాలనే అనిపించటంలేదు. అదిగో... చూశారుగా! సంగీత సాహిత్యాలు రెండూ నాకు తోడుగా వుంటున్నాయి. వాటిలో వుండే గొప్పతనం ఏదైనా – నాకు అంటుకోవాల్సిందే తప్ప – నా వ్యాధి మాత్రం వాటికి అంటుకోదు" బల్లమీద ఉన్న వయొలిన్‌వైపూ – పుస్తకాలవైపూ చూపించాడు భానుమూర్తి.

"మీరు అనవసరంగా జీవితంమీద విరక్తిని పెంచుకుంటున్నారు భానుమూర్తి గారూ!"

"లేదండీ! జీవితమంటే ఏమిటో ఇప్పుడే తెల్పుకుంటున్నాను. కోరికలను దాచుకోవటంలోనూ, అణచుకోవటంలోనూ

వున్న సుఖం ఆ కోరికల్ని తీర్చుకోవటంలో లేదని గ్రహించాను. పైగా అలా కోరికలను అణచుకున్నకొద్దీ వాటి విలువ కూడా పెరుగుతుందేమో! అనిపిస్తోంది.''

అంతలో, పనిచేసే కుర్రాడు అక్కడికి రావటంతో వాడిని హోటల్‌కు పంపించి, కాఫీ తెప్పించాడు భానుమూర్తి. అంత వరకూ సినీమాలకు సంబంధించిన కబుర్లేవో చెబుతూనే వున్నాడు భాస్కర్రావ్.

కాఫీ తాగిన తరువాత —

''మరి నేను వస్తాను''అంటూ లేచాడు.

''నాలుగు రోజులుంటారా ?'' అడిగాడు భానుమూర్తి.

''లేదండీ ... ఎల్లుండి వెళ్లిపోవాలి! ఇప్పుడు హైదరాబాద్‌లో కూడా మన పని బిజీగానే వుంటోంది.''

''అయితే రేపు రాత్రి మా ఇంటికి డిన్నర్‌కి రండి !'' ఆహ్వానించాడు.

ఔననీ, కాదనీ వెంటనే చెప్పలేక, భాస్కర్రావ్ తటపటాయిస్తుంటే —

''ఫరవాలేదు ! అన్నీ హోటల్నించే ఆర్డరిస్తాను. తప్పకుండా రావాలి. మళ్లీ నేను మిమ్మల్ని కలవలేకపోవచ్చు'' అన్నాడు భానుమూర్తి.

అతని మాటలకు బదులు చెప్పలేదు. అలాగే చూస్తుండిపోయాడు భాస్కర్రావ్.

''ఔను భాస్కర్రావ్‌గారూ ! బహుశా నేను మిమ్మల్ని మరి కలుసుకోలేకపోవచ్చు. మనం మొట్టమొదట కలుసుకున్నప్పుడు ఓ హోటల్లో టీ త్రాగాం! ఆ తరువాత ఇద్దరం కలసి విస్కీ తాగాం! రేపు మనిద్దరం విడిపోతూ కూడా మళ్లీ విస్కీ తాగుదాం !'' అన్నాడు మళ్లీ భానుమూర్తి. అంతలోనే ఏదో గుర్తుకొచ్చిన వానిలా భాస్కర్రావ్ వైపు చూస్తూ చెప్పాడు...

''అన్నట్లు నే నీ మధ్య తాగుడు మానేశాను. కానీ రేపుమాత్రం ఒక్కసారి— జీవితంలో-ఆఖరిసారి — అదీ మీతో కలసి డ్రింక్ చేయాలనుకుంటున్నాను ... కాదనకండి!... ప్లీజ్ !'' అర్థింపుగా అన్నాడు.

''నాపట్ల మీకున్న ప్రత్యేకమైన అభిమానానికి కృతజ్ఞుణ్ణి...''

''మీపట్ల అభిమానమేకాదు భాస్కర్ గారూ! అంతకుమించిన ఆత్మీయతో — గౌరవమో — నాకే తెలియదు... ! ఒకప్పుడు నా బ్రతుకుతెరువుకి ఏ దారీ కనిపించక — దేవుడిచ్చిన ఒంటరితనాన్ని వెంటబెట్టుకుని — నిరాశగా జీవిస్తున్న తరుణంలో — మీరు నాకు ఆ దేవుడిలాగే తారసపడ్డారు... నాకో మంచి బాట చూపించారు. ఈ రోజున నేను ఈమాత్రం పదిలపరచుకోగలిగానంటే అందుకు కారణం మీరేనంటాను. ఈ నికృష్టమైన వ్యాధి నాకు సోకివుండకపోతే— మీ దయవల్ల నేనింకా పైకొచ్చేవాడినేమో ! కానీ... నా కింతే రాసిపెట్టివుంది. ఇలాగే జరగాలనివుంది... అంతే!'' భానుమూర్తి కళ్ళల్లో కన్నీరు మెరిసింది.

పడిన జీవాన్ని కనుక ఎక్కడో ఓ [illegible] ఎలాగో లాగించేస్తుంటాను!... ఆరో[illegible] కోసం మానేసిన మీరుమాత్రం మళ్లీ [illegible] తీసుకోవటం మంచిదికాదు...''భాస్కర[illegible] ఓ అడుగు ముందుకు వేశాక — ఆగి అన్నా[illegible]

''నిజమే! కానీ ఒకే ఒక్కసారి తీసు[illegible]టాను. నేను ఎవరినో నాకే గుర్తు[illegible]రానంత ఎక్కువగా తాగాలని చాలాకాల[illegible] కోరుకుంటున్నాను. కానీ మీకు తెలుసుగ[illegible] తోడులేనిదే నేను డ్రింక్ చేయలేను... [illegible] నా వీక్నెస్!... అందుకే ఈ ఒక్కసారి నా



''మీరు మహా మహా గ్రంథాలన్నీ చదివేసి— సుభాషితాలు మాట్లాడేస్తున్నారు. పైగా నన్నేదో అందలం ఎక్కించేస్తున్నారు.'' భానుమూర్తి మూడ్ మార్చాలని భాస్కర్రావ్ ప్రయత్నిస్తూ అన్నాడు.

కానీ భానుమూర్తిలో ఎలాంటి మార్పూ లేకపోగా — మరింత గంభీరంగా మారిపోయాడు.

''రేపు తప్పకుండా వస్తారుగామరి!'' మరోసారి గుర్తుచేశాడు.

''అలాగే! కానీ డిన్నర్ ఒక్కటే! డ్రింక్ మాత్రం తెప్పించకండి! అలవాటు కంపెని ఇవ్వండి — చాలు!'' వీధి గుమ్మం వరకూ వచ్చి భాస్కర్రావుని సాగనంపుతూ అన్నాడు.

''అయినా మీరేదైనా మంచి నర్సింగ్ హోంలో చేరకూడదూ?'' అక్కడ నిలబడి అడిగాడు భాస్కర్రావు.

''నర్సింగ్ హోంలో చేరితే — డాక్టరు శరీరం మీది వ్యాధికే మందు వేస్తాడు. కానీ నాకు అలాంటి మందులింక అవసరం లేదు. మనసుకి వైద్యం చేసే డాక్టర్ కావాలి! ఆయన దగ్గరకు త్వరలోనే వెళ్లాలనుకుంటున్నాను భాస్కర్‌గారూ!''

భానుమూర్తి ఏవో ఊహల్లోకి చూస్తూ అన్నాడు.

## 16

ఆ రోజు కృష్ణాష్టమి ...

ఇంకా తూర్పు పూర్తిగా తెల్లవారలేదు.

అప్పుడే అక్కడకు వచ్చిన బస్సులోంచి క్రిందకు దిగాడు భానుమూర్తి.

రెండు చేతుల్లోనూ వున్న సామాన్లను ఓసారి క్రింద పెట్టి — జారిపోతున్న కళ్ళజోడును — కుడిచేతి మధ్య వ్రేలితో పైకి సవరించుకుని —చుట్టూ పరికించి చూశాడు.

'తన వూరిప్పుడు ఎంత అందంగా వుందీ' అనుకున్నాడు.

అలా అనుకుంటూంటే — ఇన్నేళ్ళూ — అంతటి అందమైన తన వూరిని వదిలి పెట్టి ఎక్కడెక్కడో తిరిగినందుకు పెదాలపై విరక్తిలాంటి చిరునవ్వూ — ఇక మిగిలిన జీవితాన్ని అక్కడే గడపబోతున్నందుకు — కళ్ళల్లో గర్వంలాంటి వెలుగూ కనిపించాయి.

తన ఊరు !

అలా అనుకోవటంలోనే తన కెంతో సంతృప్తివుంది. తను ఇక్కడే పుట్టాడు. ఇక్కడే ఎంతోకాలం పెరిగాడు.

ఆదమరచి నిద్రపోతున్న కళ్ళల్లోకి పీడకల వచ్చినట్లుగా — ఆ తరువాత — ఎక్కడెక్కడో తిరిగాడు. ఏమిటేమిటో చేశాడు. ఇప్పుడు మళ్ళీ — ప్రశాంతంగా నిద్రపోవటానికి — అమ్మ ఒడిలాంటి తన వూరు చేరుకున్నాడు. ఇకనుంచీ అక్కడి గాలీ, నీరూ, నేలా అన్నీ తానూ అనుభవిస్తాడు.

తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు భానుమూర్తి.

చేతిసంచినీ, సూట్‌కేసునూ తీసుకొని ముందుకు నడిచాడు. వీధి చివరనున్న వేణుగోపాలస్వామి ఆలయం నుంచి భక్తి పాటలు వినిపిస్తున్నాయి.

పాటలు వింటూనే వడివడిగా అడుగులు వేస్తూ — పరిసరాలను గమనిస్తున్నాడు.

తాను చదువుకున్న స్కూలు ... ఒకప్పుడు మాధవరావుగారున్న ఎత్తరుగుల పెంకుటిల్లు ...

అన్నీ దాటి వేణుగోపాలస్వామి గుడి దగ్గరకు చేరుకున్నాడు.

## అనుభూతి - అనుబంధం

గుడిలోకి నడిచి, అక్కడి అరుగుమీద తన సామాన్లను పెట్టుకున్నాడు. అప్పటికే గర్భగుడిలోంచి గంటలు వినిపిస్తున్నాయి. గుడిచుట్టూ ఒకరిద్దరు భక్తులు ప్రదక్షిణలు చేస్తున్నారు.

నూతివద్దకు వెళ్ళి కాళ్ళు కడుక్కుని మండపంలోకి నడిచాడు.

ఎదురుగా వేణుగోపాలస్వామి నిలువెత్తు విగ్రహం నల్లగా మెరుస్తోంది. చేతిలో మురళి ... మెడలో దండలు...తలపై వెండి కిరీటం !

### తన చేతన చే...

నిట్టూర్పటానికి గతం
కలగనటానికి భవిష్యత్తు
జీవించటానికి వర్తమానం

నువ్వూ నేనూ
నిన్న నల్లటి పీడలం
రేపు రంగుల నీడలం
నేడు మెలకువ జాడలం

నా చుట్టూ ఉన్న
నాతనం నడుమ
నేను కదులుతున్నాను
అందుకే
నేను ఊరుకున్నా
పిడికిలి బిగిస్తోంది
నా నీడ

— కేవస్వీ

స్వామిని చూసిన భానుమూర్తి కళ్ళలోంచి జలజలా కన్నీరు కురిసింది.

స్వామి చూపుల్లోని అందాన్నీ, పెదాలపై కనిపించే దరహాసాన్నీ తాను ఇదివరలో ఎన్నిసార్లు చూశాడో ?...అక్కడి గంటను తాను ఎన్నిసార్లు మ్రోగించాడో !

పదిహేనేళ్ళక్రితం — తాను అక్కడకు వచ్చినప్పుడు, స్వామి కళ్ళల్లోకి చూసినప్పుడు—తనకు అమ్మచూపులే కనిపించాయి. అక్కడి గంటలు మ్రోగించినప్పుడు — తనకు అమ్మ పిలుపులే వినిపించాయి.

కానీ ...

ఇప్పుడు మళ్ళీ ఆ కళ్ళల్లోకి చూస్తూంటే — అమ్మ చూపులు కనిపించటంలేదు ! కళ్ళతోటే స్వామి తనను ఆశీర్వదిస్తున్నట్లు అనిపిస్తోంది.

ఇప్పుడు మళ్ళీ ఆ గంటను మ్రోగిస్తూంటే — అమ్మ పిలుపులు వినిపించటంలేదు. స్వామి తనకేదో జీవిత రహస్యాన్ని బోధిస్తున్నట్టు అనిపిస్తోంది. జీవితంలో అడుగడుక్కీ పెనవేసే అనుబంధాలకు అర్థాన్ని చెబుతున్నట్లనిపిస్తోంది.

తన్మయత్వంతో — గంటను అలాగే మ్రోగిస్తూ వుండిపోయాడు భానుమూర్తి. కొన్ని క్షణాల తరువాత, తనను ఎవరో పట్టుకుని కుదుపుతూంటే — గంట మ్రోగించటం ఆపి — వాస్తవానికి వచ్చాడు.

"నువ్... నువ్వు భానుమూర్తివి కదూ ?" ఆశ్చర్యంగా అడిగాడు గోపాలం.

గోపాలాన్ని భానుమూర్తి గుర్తుపట్టాడు.

"అవును గోపాలం ! నేనే... వచ్చేశాను ! ఇంకెక్కడికీ వెళ్ళను ! నా స్వామి సాన్నిధ్యంలో జీవితం గడపాలని వచ్చేశాను" భానుమూర్తి కళ్ళు ఇంకా వర్షిస్తూనే వున్నాయి.

"ఏమిటి భానూ ఇది ? అసలేమయింది ? ఎందుకిలా అయిపోతున్నావ్ ?" ఆవేశంతోనూ, తన్మయత్వంతోనూ ఊగిపోతున్న భానుమూర్తిని శాంతపరుస్తూ అడిగాడు.

మరికొన్ని నిముషాలకు మామూలు మనిషయ్యాడు భానుమూర్తి.

"ఇప్పుడు చెప్పు ! ఏమిటి విశేషాలు ? ఎక్కడుంటున్నావ్?" తన ఇంటికి తీసుకెళ్ళి, కాఫీ ఇచ్చిన తరువాత అడిగాడు గోపాలం.

తన కథంతా టూకీగా చెప్పాడు భానుమూర్తి.

"ఆ రోజున నా ఇల్లు పూర్తిగా అమ్మకుండా—పెరట్లో గదిని ఉంచుకోవటం కూడా మంచిదే అయింది" అన్నాడు.

"కరణంగారు బాగున్నారా ?" మరికొంత సేపయ్యాక గోపాలాన్ని ప్రశ్నించాడు.

"కరణంగారు పోయారు భానూ ! రెండేళ్ళయింది. ఇప్పుడు ఆయనగారి బావమరిది ఈ వూరి కరణీకాన్ని చూస్తున్నాడు" అన్నాడు గోపాలం.

"మరి వారమ్మాయి సుధ ఎక్కడుంటోంది ?"

"సుధఇప్పుడు అమెరికాలోవుంటోంది... మంచి సంబంధమే చేశారు ఏదో కంపెనీలో పెద్ద ఉద్యోగం చేస్తున్న కుర్రాడికి చేశారు.

# కలిసిపోతుంది తక్షణం న్యూట్రాముల్
# వేడి పాలలోలాగే చల్ల పాలలోనూ

## 'హై వేక్యూమ్ డ్రయింగ్' పద్ధతివలన తయారౌతాయి
## త్వరగా కరిగే న్యూట్రాముల్ గుళికలు

కొత్త 200 గ్రా. సీసా









తయారవ్వు
న్యూట్రాముల్ వస్తాదుగా

అమూల్ వారి
# న్యూట్రాముల్



మార్కెట్ చేయువారు :
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్ 388 001. గుజరాత్

daCunha-GCM-26 TL

ఆ తర్వాత అతను ఎందులోనో రిసెర్చ్‌చేసి– ఈ మధ్యనే సుధని కూడా తీసుకుని అమెరికాలో ఉద్యోగానికి వెళ్ళిపోయాడు. నువ్ ఎప్పుడో అన్నావటగా – 'అదృష్టం బాగుంటే హైదరాబాద్ కుర్రాడేమిటీ – సుధకి అమెరికా కుర్రాడే వస్తాడని!' – అలాగే జరిగిందని అప్పుడప్పుడు శ్యామలాంబగారు అంటూంటారు. ఆవిడ ఇక్కడే తమ్ముడితో వుంటున్నారు' – గోపాలం అలా చెప్తూంటే భానుమూర్తికి నవ్వొచ్చింది.

అప్పుడెప్పుడో–పదిహేనేళ్ళ క్రితం, తాను అన్నమాట నిజమయింది. మరి తాను ఆశించినవి -- తన జీవితంలో ఎందుకు నిజం కావటంలేదూ ?

ఆనాడు తనను పెళ్ళి చేసుకొమ్మని సుధ అడిగినప్పుడు – తాను ఒప్పుకుని వుంటే ఏమయ్యేది ?

అయినా తనకింతే – ఇలాగే – జరగాలని రాసిపెట్టి వుంది.

''అదిసరే కానీ, హాయిగా పట్నంలో వుండేవాడికి – ఈ పల్లెటూళ్లో ఇల్లుమళ్లీ ఎందుకు కావాల్సి వచ్చింది?'' అడిగాడు గోపాలం.

ఆ క్షణంలో భానుమూర్తి ముఖకవళికలు మారిపోయాయి. గంభీరంగా చూస్తూ –

''లేదు గోపాలం! నేను ఇక ఇక్కడ వుండిపోవాలనే వచ్చాను. ఇకనుంచీ నా ఇల్లే నాకు ప్రపంచం. ఆ షావుకారు అమ్మేస్తానంటే మొత్తం ఇల్లంతా నేను మళ్లీ కొనేస్తాను. కొత్త అనుబంధాన్ని కానీ అనుభవాన్ని కానీ – నా జీవితంలోకి రానీయను...నేనసలు బయటి ప్రపంచంలోకి వెళ్ళదల్చుకోలేదు. అలా వెళ్ళి నలుగురిచేతా అసహ్యంప బడదల్చుకోలేదు ... అంతే!''

భానుమూర్తి చెప్పేది అర్థం కానట్టు– అతని కళ్ళల్లోకి చూస్తూండిపోయాడు గోపాలం.

''ఔను గోపాలం! నన్ను నేనే అసహ్యించుకునేలా చేసే వ్యాధి నాలో ప్రవేశించింది. కుష్ఠువ్యాధి . ఇదిగో చూడు!'' చొక్కా చేతుల్ని పైకి మడుస్తూ – చేతులు చూపించాడు.

గోపాలం త్రుళ్ళిపడ్డాడు.

''భయం వేస్తోంది కదూ! నిజమే... ఎవరికైనా భయాన్ని కలిగించే వ్యాధి ఇది. అందుకే అందరికీ దూరంగా జీవించాలని ఇలా పారిపోయి వచ్చాను. కొందరికి జీవితాలు భగవంతుడు ప్రసాదించిన తీయనివరాలైతే– ఆ జీవితాల్లో ఇలాంటి భయంకర వ్యాధులు సంప్రాప్తించటం – తీరని శాపాలే గోపాలం!''

''నువ్ అనవసరంగా భయపడుతున్నావ్ భానూ! ఈ రోజుల్లో భయంకరమైన వ్యాధంటూ ఏదీ లేదు ... ఎన్నో మందులు వస్తున్నాయి. ప్రయత్నిస్తే నీ వ్యాధి నయం కాకపోదు.'' సానుభూతి కనపరుస్తూ అన్నాడు గోపాలం.

''నువ్వన్నది నిజమే! కానీ నాకిప్పుడు కావల్సింది మందులూ, ఆరోగ్యం కాదు గోపాలం! మనసుకింత శాంతి కావాలి. ఆ శాంతిని వెతుక్కుంటూ ఇంత దూరం వచ్చాను. నా ఊళ్లో, నా ఇంట్లో నేనుండాలి .. చివరికి నా మట్టిలో నేనే కలిసిపోవాలి.'' ఆవేశంగా వున్నాయి భానుమూర్తి మాటలు

''బ్రతకటానికి ఇల్లు ఒక్కటుంటే సరిపోతుందా? ఏదో ఒక వ్యాపకం కూడా కావాలిగా!''

''పగలు చదువుకోవటం రాత్రి పాడుకోవటం - ఇవే నా వ్యాపకాలు! రామదాసు తాతలా తత్వాలు పాడుకుంటూ గడిపేస్తాను. కానీ...నువ్ నాకో సహాయం చేయాలి గోపాలం!'' ఆశగా చూస్తూ అడిగాడు.

''ఏమిటీ?''



''ప్రతిరోజూ నీ కొడుకుచేత నాకింత స్వామి ప్రసాదం పంపించగలవా? అంతకంటే నేను మరేమీ కోరుకోను. బ్రతకటానికి తినాలి కనుక, ఆ మాత్రం నువ్ పుణ్యం కట్టుకో ...! నా తర్వాత, నా ఆస్తి అంతా నీ చిన్న కొడుక్కి రాసిచ్చేస్తాను గోపాలం!'' అమాయకంగా అన్నాడు.

భానుమూర్తి పరిస్థితినీ – ఆవేదననూ అర్థం చేసుకున్న గోపాలం కళ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

''నీ పరిస్థితికి జాలిపడాలో, బాధపడాలో అర్థం కావటం లేదు భానూ! నువ్ నిజంగా శాపగ్రస్థుడివేమో అనిపిస్తోంది. లేకపోతే నీ జీవితం ఇలా అస్తవ్యస్తంగా చివికిపోయేది కాదు.'' సానుభూతి పూరకంగా భానుమూర్తి భుజంపై చేయివేస్తూ అన్నాడు.

''లేదు గోపాలం. ఇన్నాళ్లూ దేవుడిచ్చిన శాపాన్ని అనుభవించాను. ఇవాళ నాకు శాపవిమోచనం కలిగింది. మళ్లీ నా స్వామి సన్నిధికి నేను వచ్చేశాను. నా కళ్ళల్లో వెలుగు వుండేటంత వరకూ స్వామిని కళ్ళల్లో దాచుకుంటాను. నా గొంతు మూగపోయే వరకూ భక్తిపాటలు పాడుకుంటాను. చివరికి నా మట్టిలో నేను కలసిపోతాను!'' శూన్యంలోకి చూస్తూ అన్నాడు భానుమూర్తి.

అతని మాటలు దృఢంగానూ, నిశ్చలంగానూ వున్నాయి!

జీవితానికి అర్థాన్నీ, పరమార్థాన్నీ విడమరచి చెబుతున్నట్టు వున్నాయి!!

దూరంగా వేణుగోపాలస్వామి కోవెల్లో గంటలు మ్రోగుతున్నాయి!!!

(అయిపోయింది)

**అంకితం**

''ఈ నవలా రచనకు ప్రేరణ, యాదగిరి గుట్టలోని శ్రీ లక్ష్మి నృశింహస్వామి ఆలయం! ఎన్నో పవిత్రమైన జ్ఞాపకాలకు నిలయం! అందుకే ఇది ఆ స్వామికి అంకితం!''

— జీ. రా. మూర్తి

# జుట్టు అసలు ఎందుకు ఊడుతుందని ?



జుట్టుపైన ప్రకృతిలోని చాలా వాటి ప్రభావం పడుతుంది. మారే ఋతువులు, మార్పే వాతావరణం, ఎండ, చెమ్మ, అస్వస్థత, ఆందోళన, కుళాయి నీళ్ళల్లో కలిసిన క్లోరిన్ ఇవి సరే. జుట్టు వూడి, రాలి పోవడానికి వీటన్నిటి కన్న ముఖ్యమైన కారణం, దానికి సరియైన ప్రమాణంలో పోషణ అందక పోవడం. మరి ఒచ్చే చిక్కేమిటంటే, మీకు బజార్లో ఎక్కువగా దొరికే కేశ సంరక్షణ కోసం వాడే నూనెలు శుద్ధ మైనవి కాకపోవడం దాంతోటే, ఆధునిక నాగరికత మోజులో పడి ప్రకృతి సహజమైన నూనెలపైన విముఖత పెరగటంతో యిది మరీ చిక్కు సమస్య అయింది.

**కొబ్బరి నూనె తర తరాల నుంచీ, అంటే మీ అమ్మగారి, వాళ్ళమ్మగారి, వాళ్ళ అమ్మమ్మ గారి అందమైన తలకట్టు, జుట్టులోని కీలకం.**



శతాబ్దాలబట్టీ స్త్రీలు శుద్ధమైన, తాజా కొబ్బరి నూనె వాడి ఒత్తయిన జుట్టు పెంచుకుంటూ, ఆ జుట్టు ఊడి పోకుండా కాపాడు కుంటూన్నారు.




**అసలు కొబ్బరినూనె పరిశుద్ధత, తాజాదనం ఋజువు చేసుకోడానికి 3 ఉపాయాలు :**



మీరు వాడే కొబ్బరి నూనెను పారాచూట్ కొబ్బరి నూనెతో పోల్చి చూడటానికి తేలికైన 3 పరీక్షలని చెయ్యండి.

1. చూడండి, ఆ నూనె పారదర్శకమై అటూ యిటూ కనిపించేలా ఉండాలి.
2. వాసన చూడండి, ఇది పాచి వాసన లేకుండా తాజాగా సరియైన వాసనతో ఉండాలి.
3. ఈ నూనె సరిగ్గా, ఆగకుండా, సహజంగా పారగలిగి ఉండాలి.

మరి మీ జుట్టుకు యీ పరీక్షలకి నిలవ గలిగిన శుద్ధమైన, తాజాదనంగల కొబ్బరి నూనెనే రాసుకోండి.

# పారాచూట్

కొబ్బరి నూనె—

నూనెల్లో సర్వోత్తమం, ప్రకృతి సహజత్వం, పరిశుద్ధత, తాజాదనం, వీటి సంగమం.

స్వచ్ఛంగా, తాజాగా, సువాసనతో, బలాన్నిచ్చే వాటితో నిండినది.

SIMOES/BOI/3/80A TL

# మలుపు మొక్కలు

స్వాత్రన్



ఉద్యోగాన్వేషణలో ఎక్కే గడప దిగే గడపగా తిరుగుతున్న చలపతి అలసిపోయాడు అంత కంటే విసిగిపోయాడు. విసిగిన ప్రాణం విరక్తిని కలిగిస్తుంటే వెనుకనున్న బాధ్యత వెన్ను తడుతోంది.

ఆశలు నిండిన కళ్ళలో నిరాశ చోటుచేసుకోగా తన రూముకు చేరుకున్నాడు చలపతి. గది తలుపు తెరుస్తూ ఎదురుగా కనిపించిన కవర్ని ఉద్వేగమైన మనసుతో తెరిచి చూశాడు.

"రాబోయే గురువారం పదకొండు గంటలకు దేశీ కెమికల్స్ కంపెనీలో కెమిస్ట్ పోస్టుకు ఇంటర్వ్యూకు రమ్మని" దాని సారాంశం.

చలపతి కళ్ళు ఒక్కసారిగా వెలుగును పులుముకున్నాయి. కాని ఆ వెలుగు ఎంతో సమయం నిలువలేదు. "తమ ఇంతకుముందు ఎన్ని ఇంటర్వ్యూలకు వెళ్ళిరాలేదు. కాని ఉద్యోగం సంపాదించలేకపోయాడు తన 'ఇనెఫిషెన్సి'వల్లనా? కానేకాదు. యం.యస్.సిలో డిస్టింక్షన్‌లో పాసయిన తను ప్రతి ఇంటర్వ్యూ ఎంతో బాగా చేశాడు. ఫలితం తన కంటె ఏ మాత్రం బాగా చేయని అనామకులను ఎంచుకున్నారు. అంత కంటే వారు సమర్పించిన ఉత్తర దక్షిణాలకు దాసోహమన్నారంటే బాగుంటుంది.

తనకు రెండూ లేవు. ఉన్నదల్లా కాలే కడుపు, మండే గుండెలు. వీటికితోడు ఇప్పుడిప్పుడే లోకాన్ని చదవగలుగుతున్న కళ్ళు. ఇప్పుడు ఈ ఉద్యోగం మాత్రం వస్తుందని నమ్మకమేమిటి ? రాదు. జరుగుతున్నదంతా నాటకం. జరగవలసినదంతా జరిగిపోయిన తరువాత ఆడే బూటకం. ఈ ఇంటర్వ్యూలు తనలాంటి వాళ్ళను అపహాస్యం పాలు చేయటానికేనా! ఏమో ? ఇదే అక్షరాల జరుగుతున్నది. తానీ హింసను భరించలేడు. వారి అపహాస్యాన్ని తానిక ఎంతోకాలం సహించలేడు. ఏదో ఒకటి చెయ్యాలి" నిర్ణయించుకున్నాడు చలపతి.

చలపతి మనసు ఈ నిర్ణయంతో ఎంతో తేలిక పడింది.

వర్షం కురిసి వెలిసిన తరువాత ఏర్పడే ప్రశాంతత అది.

"చలపతి! ఏమిటలా కూర్చుండిపోయావు బట్టలయినా మార్చుకోకుండా. చేతిలో ఆ పుత్తరం ఏమిటి ?" అప్పుడే వచ్చిన సారథి పలకరింపుతో ఈ లోకానికి వచ్చాడు చలపతి.

చలపతి, సారథి స్నేహితులు. ఇద్దరూ రూమ్ మేట్సు. సారథి చదువులో అంత ఉత్సాహం కనబరచకపోవటంతో ఐ. టి. ఐ.తో సరిపుచ్చుకోవాల్సి వచ్చింది. 'టెక్నికల్' కావటంవల్ల త్వరగా ఉద్యోగం రావటం, సెటిలయిపోవటం జరిగింది. స్వతహాగా సారథి ఉన్నవాడు కావటంతో తన బాల్యస్నేహితుణ్ణి తన రూములో వుండి పొమ్మనటం జరిగింది.

"ఇంటర్వ్యూ కాల్ లెటర్ వస్తే చూస్తున్నాను" అంటూ చేతిలోని ఉత్తరాన్ని సారథికి అందించాడు చలపతి.

* * *

ఆరోజు గురువారం, అనుకున్న రోజు రానే వచ్చింది

"చలపతి! నేను ఆఫీసుకు వెళుతున్నాను. ఇంటర్వ్యూ బాగా చేస్తావని ఆశిస్తాను. సాయంత్రం నేను హోటల్ స్వరాజ్ దగ్గరకు ఐదు గంటలకల్లా వస్తాను. నీవు కూడ అక్కడకు వస్తే అటునుంచి అటు ఇద్దరం కలసి పిక్చర్‌కు వెళదాం" కార్యక్రమాన్ని వివరించాడు సారథి

"లేదు ఈరోజు పిక్చర్‌కు నేను రాలేను. నువ్వు వెళ్ళిరా."

"చూడు చలపతీ, నిన్ను విడిచి ఈ సంవత్సర కాలంలో నేను పిక్చర్‌కు వెళ్ళానా? అలా జరగదు. నీవు కాదనకు. ఇద్దరికి రిలీఫ్ కావాలి. తప్పకుండా సాయంత్రం కలుస్తావు కదూ ? నీ కోసం ఎదురు చూస్తూవుంటాను" అంటూ హెచ్చరించి వెళ్ళిపోయాడు సారథి.

సారథి అభ్యర్థనను కాదనలేని చలపతికి మౌనంగా వుండిపోవటం తప్పలేదు.

ఇంటర్వ్యూకు బయలుదేరిన చలపతి కళ్ళలో ఇదివరకటి ఆత్రుత, ఉత్సాహం మచ్చుకైనా లేదు. భవిష్యత్‌కాలాన్ని తెలుసుకున్న జ్ఞానిలా నిర్వికారంగా ముందుకు కదిలాడు

"ఎలా చేశావు ఇంటర్వ్యూ?" అడిగాడు సారథి స్వరాజ్ హోటల్ డైనింగ్‌టేబుల్ ముందు కూర్చున్న చలపతిని.

"అందరూ తెల్లమొహం వేశేలా చేశాను."

"అంటే!?"

"ఏముంది. వారడిగిన ప్రతిదానికి అంతు పట్టని జవాబులిస్తూ వారిని పూర్తిగా బ్లఫ్ చేశాను."

"చలపతీ! ఎందుకలా చేశావు? నీకు పిచ్చి పట్టలేదుకదా?"

"ఇంతకాలం వారడిగిన ప్రతిదానికి నమ్రతతో సమాధానాలిస్తూ, ఉద్యోగం ఇస్తారనే ఆశతో, నా చదువుమీద నమ్మకంతో, యూనివర్శిటీ వాళ్లిచ్చిన యీ సర్టిఫికేట్స్‌నే నా జీవితంగా భావిస్తూ బ్రతికాను. కాని ఇప్పటివరకు జరిగిందేమిటి? ప్రతిసారి ఇంటర్వ్యూ బాగా చేసినందుకు మెచ్చుకున్నారు. నాకే ఉద్యోగమిస్తున్నట్లు మాట్లాడారు తీరా ఏ అవర్నుడికో ఉద్యోగమిస్తూ వచ్చారు. అది వారి తప్పుకాదా? అలా చేసింది వారికి పిచ్చి పట్టేనా??

ఉత్తర, దక్షిణాలకు దాసోహమంటూ అర్హత గణించిన నన్ను నిలువునా పాతాళానికి అణచివేశారు. ఇది వారి హక్కంటారా? నామీదే ఆశలు పెంచుకుని నాన్న లేకపోయినా పెంచిపెద్ద చేసి చదివించిన 'అమ్మ' సుకృతమంటారా? నాన్నంటే ఎవరో తెలియని చెల్లి, తమ్ముడు నామీదే తమ భవిష్యత్తును నిలుపుకొని ఎదురు చూడటం వాళ్ళు చేసిన నేరమంటారా? ఇదంతా కావాలని చేస్తున్నది కాదా! ఏది మట్టు చెప్పలేని నేను ఉద్యోగం సంపాదించటం అసంభవం" ఉద్రేకంగా తన బాధను, వ్యతిరేకతను వ్యక్తపరిచాడు చలపతి

"కావచ్చు. అంతమాత్రాన ప్రతి ఒక్కటి అలాగే జరుగుతుందనుకోవటం తెలివైన పనికాదు. సంఘంలో ఎన్నో రకాల మనుషులు, మనస్తత్వాలు వున్న తరువాత మంచికితోడు చెడు వుండక తప్పదు. అయినంత మాత్రాన ప్రతి ఒక్కటి చెడు అనుకోవటం సబబుకాదు."

"ఇవన్నీ మాటలద్వారా మనం చెప్పుకోవటానికి పనికివచ్చే స్వాంతన వచనాలు మాత్రమే. కాలేకడుపుకు ఇంత గంజి పోయలేని ఈ సంఘాన్ని వెనకేసుకు రావటం అసంగతం" అన్నాడు తన వాదనను సమర్థిస్తూ చలపతి.

"సరే, అయిందేదో అయింది. జరిగిన దాన్ని మర్చిపో. నీకు కల్గిన ఈ అభిప్రాయం తప్పని ఒక నాటికి తెలుసుకోకపోవు" సినిమా టయిము దగ్గర పడటంతో బిల్లు చెల్లించి లేచాడు సారథి.

* * *

"చలపతీ! గుడ్ న్యూస్" చలపతి బజారు నుంచి వస్తుండగా గుమ్మంలోకి ఎదురు వెళ్ళాడు సారథి.

"ఏమిటో అంత మంచివార్త. బహుశ అమ్మదగ్గర నుంచి ఉత్తరం వచ్చి వుండవచ్చు" వెనుకకు వడచి పట్టుకున్న సారథి చేతుల వంక చూస్తూ అన్నాడు చలపతి.

"లేదోయ్, ఇప్పటికైనా నీ అభిప్రాయం తప్పని ఒప్పుకోవలసిన సాక్ష్యాధారం."

"అంత నా అభిప్రాయం తప్పని ఒప్పుకోవలసి ఏమొచ్చిందో ఇప్పుడు?"

"ఎప్పాయింట్‌మెంట్ ఆర్డరు" కాగితాన్ని చలపతి కందిస్తూ అన్నాడు సారథి.

చలపతి తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు క్షణకాలం. ఆలోచించిన కొద్ది అంతుపట్టని ఆలోచనలతో బుర్ర వేడెక్కింది.

ఆరోజు చలపతి జాబ్‌లో జాయిన్ అవ్వాలసిన రోజు. కాని అతని మనసు ఏదో తెలియని భయంతో నిండిపోయింది. అసలు ఈ జాబ్ తనకు ఎలా వచ్చింది? అన్నదే అతనికి తెగని సమస్య. ఆఫీసుకు వెళ్లిన చలపతి మధ్యాహ్నానికి జాయినింగ్ రిపోర్టు, ఆఫీసుకు సంబంధించిన మిగితా కాగితాలు పూర్తి చేసి యివ్వటం జరిగింది.

తన సీటులో కూర్చొని ఆఫీసు కాగితాలు, లాబ్ రిపోర్ట్సు కొలీగ్ సహాయంతో తనిఖీ చేస్తున్న చలపతికి బాస్ దగ్గిరనుంచి పిలుపు వచ్చింది. ఇంత త్వరలో బాస్‌కు తనతో ఏమి పని పడిందో అర్థం కాని చలపతి ఆలోచిస్తూ క్యాబిన్‌లోనికి వెళ్లాడు

"యస్. మిస్టర్ చలపతి. టేక్ యువర్ సీట్" అన్నారు బాస్ ఎదురుగావున్న కుర్చీని చూపిస్తూ.

"థాంక్యూ సర్" అంటూ బితుకు బితుకుగా బాస్ చూపించిన కుర్చీలో కూర్చొన్నాడు చలపతి.

"మిస్టర్ చలపతీ! చార్జి తీసుకున్నారనుకుంటాను. మీకు తెలియని విషయాలు చీఫ్ కెమిస్ట్‌గారితో సంప్రదించండి. మొదట కొత్తగా ఫీలవటం సర్వసహజం. ఇక ముందు మీరు బాధ్యత గల వ్యక్తి అనే విషయాన్ని మీరు మరువకూడదు" అన్నారు బాస్ కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ.

'ఓ. కె. సార్!" అన్నాడు చలపతి సాధ్యమైనంత అణకువగా.

బాస్ తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ "చూడు చలపతి, ఇంత చిన్న వయసులో సంఘంమీద ద్వేషం పెంచుకోవటం నీకే మంచిది కాదు. నిరుద్యోగ సమస్య దేశాన్ని పట్టిపీడిస్తున్నదనటం నిర్వివాదాంశం. కాని నీలాంటి యువతరం సహనాన్ని కోల్పోయి సంఘాన్ని ద్వేషించటం తెలివిగల పని కాదు. నువ్వు ఇంతటి వాడివయింది ఈ సంఘం సహకారం వల్లనే అనే విషయాన్ని మరువకూడదు. ఈరోజున అభివృద్ధి చెందిన దేశాలలో కూడా నిరుద్యోగ సమస్య వియ్యతాండవం చేయటం నీకు తెలియంది కాదు. ఇంతెందుకు, ఇప్పుడు ఉద్యోగం చేస్తున్నవారు కూడ ఎన్నో నష్టకష్టాలకు గురి కాకుండ ఉద్యోగం సంపాదించలేదు అన్న విషయం నీవు గుర్తించాలి. ఈ రోజున యువకుల్లో లోపించిన ఓర్పువల్ల ఈ సమాజంలోవారు 'కలుపు మొక్కలై' నిలువకూడదు.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందో, ఈ ఉద్యోగం నీకు ఎలా వచ్చిందా అనే విషయాలు నీకు క్యూరియాసిటీని కలిగించవచ్చు. నీవు హోటల్ 'స్వరాజ్'లో నీ మిత్రునితో చెప్పిన నీ భావాలు, నిరుద్యోగ కారణంగా నీలో ఏర్పడిన నైరాశ్యత, నీ బాధ్యతలు ఆ సమయంలో మీ ప్రక్క టేబుల్ వద్ద కూర్చున్న నేను వినటం జరిగింది. యువకులలో మనస్థైర్యాన్ని, మంచిని పెంచాలనుకునే నేను ఈ ఉద్యోగానికి కావలసిన అర్హతలు నీకున్నాయని నీ అప్లికేషన్ ద్వారా తెలుసుకొని దీనిని నీకు ఇవ్వటం జరిగింది. ఇకముందు నీ మనో చాంచల్యాన్ని విడనాడి ఒక చక్కటి బాధ్యత గల ఆఫీసరుగా రూపు దిద్దుకోవాలనేదే నా ఆకాంక్ష" అన్నారు బాస్ తను చెప్పదలుచుకొన్నది — ముగిసిందన్నట్లుగా.

అంతవరకు అవాక్కయి వింటూ తన పొరపాటును తెలుసుకున్న చలపతి మనసులో "బాస్" ఎంతో ఉన్నతుడుగా ఎదిగిపోయాడు.

"థాంక్యూ ఫర్ యువర్ కైండ్‌నెస్ సార్!" అన్నాడు ఉద్వేగమైన మనసును అదుపు చేసుకుంటూ, అంతకంటే తన కృతజ్ఞతను ఎలా తెలియజేయాలో తెలియని చలపతి.

## మనోహర్మ్యం

మనోహర్మ్యంలో మందిరాలనేకం
కొన్ని అలంకార సుశోభితాలు
కొన్ని ధూళి ధూసరితాలు
కొన్ని కస్తూరి కాగరు పరిమళ భరితాలు
కొన్ని దుస్సహ దుర్గంధ భూయిష్టాలు
కొన్ని సువిశాలాలు
కొన్ని అత్యంత సంకుచితాలు

రమ్యమైన వాకిళ్లు
అరణ్యాల్లాంటి లోగిళ్లు
జీబూతాల్లాంటి ముంగిళ్లు
పెనుభూతాల్లాంటి పెరళ్లు
ఇల్లంతా యధేచ్ఛగా
కలయ దిరగ వచ్చు
కాని ...
ఏదో ఒక గదిలో ...
ఎదలో శూలానికి మూలమో
మదిలో మచ్చకు అర్థమో
గుప్తాగారంలో అస్థిపంజరమో
సుప్త భుజంగమో
సాకారమో నిరాకారమో
ఒక భయంకర రక్షశక్తి
దాగివున్నది జాగ్రత్త!
ఆ గది గుర్తుంచుకో
ఆ తలుపులు తెరువకు

పి. జె. రామారావు

# 1949కి ముందుగా మీరు జన్మించినట్లైతే ఈ ప్రకటన పూర్తిగా చదవండి.



## 10కి 9 మంది ప్రజలకి 30పళ్ళకి పైబడ్డ వారికి జుట్టు వూడటం సంభవిస్తుంది...మరి ఇది వారికి తెలియదు!

**ఆ 9 మందిలో మీరు ఒక్కరైతే ప్యూర్ సిల్విక్రిన్ వాడటం నేడే ప్రారంభించండి.**

మీ దువ్వెనతో మీ జుట్టును గట్టిగా దువ్వండి. మీ దువ్వెన మీదకి వెంట్రుకలు వచ్చినట్టయితే ఆనవాలు మీ జుట్టు వూడిపోతుందన్నమాట. మీరు వెంటనే—అంటే యిప్పుడే చర్య తీసుకోవాలి. లేకపోతే మీ జుట్టు పల్చనై పోయినట్టు మీకు అద్దంలో స్పష్టంగా కన్పించటం ప్రారంభిస్తుంది. ముఖ్యమైన ఎమినో ఏసిడ్‌లు జుట్టుకి సహజమైన ఆహారం. అవి కొరతైతే, జుట్టుపల్చబడిపోయి ఆరోగ్యం కోల్పోతుంది వాటి కొరతని తొలగించక పోయినట్టయితే జుట్టు వూడిపోతూనే వుంటుంది. అందుచేత మీరు ప్యూర్ సిల్విక్రిన్ వాడటాన్ని ఈరోజే ప్రారంభించటం అవసరం.




**ప్యూర్ సిల్విక్రిన్‌లో ఏమిటి ఉంటాయంటే:**

1 పెద్దది చేసిన ఒక ప్యూర్ సిల్విక్రిన్ చుక్క

సహజ జుట్టు అవసరాలవి తీర్చేందుకు దేహం సమకూర్చే 17 ఎమినో ఏసిడ్‌ల అపూర్వ సమ్మేళనమే ప్యూర్ సిల్విక్రిన్.

**ప్యూర్ సిల్విక్రిన్ ఎలా పని చేస్తుందంటే:**

2 లోపలకు చొచ్చుకు వెళ్ళే చర్య.

ప్యూర్ సిల్విక్రిన్ వెంట్రుకల మొదళ్లలోవరకు వెళ్ళేదాక దాన్ని తలమీద చర్మ భాగంలో యింకేట్టు బాగా మర్దనం చెయ్యండి. శాస్త్ర పరిశోధనలతో రూపొందించి ప్యూర్ సిల్విక్రిన్‌లో ఇమిడ్చిన ప్రక్రియ పద్ధతి యిప్పుడు పని చెయ్యటం ప్రారంభిస్తుంది; మళ్లీ జుట్టు పెరుగుదల కొనసాగేట్టు దోహదం చేస్తుంది. మీ జుట్టు మళ్లీ యథా ప్రకారం ఆరోగ్యంగా పెరిగే వరకూ మీరు ప్యూర్ సిల్విక్రిన్‌ని రోజుకి రెండుసార్లు చొప్పున ప్రతి రోజూ వాడండి.

# ప్యూర్ సిల్విక్రీన్




OBM/4781 A

"నేను ఓ బ్యాంక్ ఆఫీసర్ని.
మంచి విలువనిచ్చే బట్టలంటే ముచ్చట నాకు."

మీకు నచ్చే దుస్తులు
మీరు మెచ్చే బట్టలు






సూటింగులు, షర్టింగులు, చీరలు, డ్రెస్ మెటీరియల్స్, మరియు డెనిమ్.

**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షర్రాక్ మిల్స్ **మఫత్‌లాల్ ఫైన్**

MF-2 TEL



# మువ్వల మురళి

ఆర్. సంధ్యాదేవి

సంధ్యా సమయం. ద్వాదశాత్ముడు తన అరుణ కిరణాలను ప్రోగు చేసుకుంటున్నాడు.

విహాయసము పంచరంగులతో విచిత్రమైన శోభలను వెదజల్లుతోంది. పక్షి గణములు తమ కలకూజితములతో గూళ్ళకు చేరుకుంటున్నాయి.

ఆ వాతావరణం అతి ప్రశాంతంగా, హాయిగా, ఆహ్లాదకరంగా, మనోజ్ఞముగా కనిపించసాగింది.

హరిత డాబామీద నిలబడి ముగ్ధురాలై ఆకాశంవైపు అలాగే చూడసాగింది. విశాలి మెల్లగా డాబామీదకు వచ్చింది. ఆడపడుచు అలా ఎటో చూస్తూ నిలబడిపోవటం చూసి,

''ఏమిటి? అలా పరధ్యానంలో పడిపోయావు!'' అంటూ నవ్వింది.

వదినగారి మాటలతో ఉలిక్కిపడి తలతిప్పి చూసింది.

''ఏమిటి ఆలోచిస్తున్నావు ? మా అన్నగారి గురించా ?'' కొంటెగా నవ్వింది.

''అబ్బబ్బ! నీకు ఎప్పుడూ ఆ మాటే'' చిరు కోపంతో మూతి బిగించింది హరిత.

విశాలి తనలో తాను నవ్వుకుంటూ అంది —

''నీ బట్టలు సర్దుకున్నావా ? ఇంకా సర్దుకోవాలా ?''

''సర్దేసుకున్నాను'' అంది హరిత.

''ఒక్కదానివే వెళ్ళగలవా ?'' అనుమానంగా అడిగింది విశాలి.

వదినగారి భయానికి హరిత నవ్వింది.

''నీకు నవ్వుగానే వుంటుంది'' అంది విశాలి.

''బాగుంది. నవ్వక ఏం చెయ్యమంటావు ?''

''సరిగ్గా మా అన్నయ్య పెళ్ళి కూడా ఇప్పుడే లేకపోతే, అందరం మద్రాస్ వెళ్ళిపోదుం'' అంది విశాలి.

మల్లిఖార్జునరావు ఓ ఆఫీసులో మేనేజర్‌గా వైజాగ్‌లో పనిచేస్తున్నాడు. అతని తండ్రి చనిపోయి పది సంవత్సరాలు అవుతుంది. తల్లి వుంది. మల్లిఖార్జునరావుకి పెళ్ళి అయి నాల్గు సంవత్సరాలు. రెండు సంవత్సరాల అబ్బాయి వున్నాడు.

మల్లిఖార్జునరావు చెల్లెలే హరిత, పి.యు.సి పాసయింది.

ఆ సంవత్సరం ఆమెకు పెళ్ళి చేసేయాలని అతను సంబంధాల కోసం వెదుకుతున్నాడు.

హరితకు ఏ సంబంధం నచ్చటంలేదు. వచ్చిన వాళ్ళందరికీ ఏదో వంకపెట్టి పంపించేస్తుంది.

వచ్చిన సంబంధాలు చెల్లెలు అలా వెళ్ళగొట్టేస్తుంటే మల్లిఖార్జునరావు, భార్య దగ్గర తల పట్టుకుని కూర్చొసాగాడు. ఇది ఇంత పెంకి ఘటం అయిపోయింది ఏమా అని. తల్లి గోవిందమ్మకు కూడా కూతురి గురించే బెంగ. ఎవ్వరి మాట వినదు. కూతురు చిన్నప్పటినుండీ అంతే అని ఆవిడ ఒక్కోసారి విసుక్కునేది.

తండ్రి వున్న రోజుల్లో హరిత ఆయన చేతిలో ఆణిముత్యంలా పెరిగింది. తండ్రికి ఆమె అంటే పంచప్రాణాలు.

మద్రాస్‌లో గోవిందమ్మ అన్నగారి కూతురు పెళ్ళి. ఆవిడ ఒక వారం రోజులు ముందుగా వెళ్ళిపోయింది.

అదే ముహూర్తానికి రాజమండ్రిలో మల్లిఖార్జునరావు బావమర్ది పెళ్ళి. భార్యాభర్తలు ఇద్దరూ ఆ పెళ్ళికి వెళ్తూ, చెల్లెల్ని మద్రాస్ పెళ్ళికి పంపిస్తున్నారు.



# కొత్త సీరియల్ ప్రారంభం

ముందుగా తల్లితో చెప్పమంటే, హారిత ఒప్పుకోలేదు. పెళ్ళి రేపు అనగా వెళ్తానంది.

హారిత మెడ్రాస్ ప్రయాణం గురించి ఆలోచిస్తోంది.

ఎప్పుడూ ఒక్కత్తే వెళ్ళలేదు. భయం అని కాదు. ఏమిటోలా వుంది. 'మామయ్య కూతుళ్ళని వాళ్ళని చూస్తాను' అనుకుంటే సంతోషంగా వుంది.

బాబు ఏడుస్తున్నట్టు వినిపిస్తే విశాలి క్రిందకు వెళ్ళింది.

ఆ రాత్రి ఒకసారి సూట్‌కేస్ తీసి, అన్నీ సర్దుకున్నానా లేదా ? అని మరోసారి చూసుకుంది. అన్నీ వున్నాయి అని సూట్‌కేస్ మూసేసి, కెమెరాలో ఫిల్ములు వేసి, సూట్‌కేస్‌లో పెట్టి తాళం వేసేసింది. ఉదయం ట్రైన్‌లో కట్టుకోవలసిన చీర, జాకెట్ తీసి పైన పెట్టుకుని, హ్యాండ్ బ్యాగ్‌లో డబ్బు జాగ్రత్త చేసుకుని బీరువాలో పెట్టుకుంది.

ఆమె ఆలోచనలు అయిదు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలపైకి వెళ్ళాయి. పెద్ద మామయ్యకు రమ, లీలలు ఇద్దరు కూతుళ్ళు. కుమార్ మామయ్య పెద్దకొడుకు. రమకి, కుమార్‌కి ఒకేసారి పెళ్ళి చెయ్యాలని సంబంధాలు వెతుకుతున్నాడు.

అప్పుడు కుమార్ తండ్రితో కల్సి వైజాగ్ వచ్చాడు.

హారిత కంటే కుమార్ అయిదు సంవత్సరాలు పెద్ద. అతను హారితను చేసుకోవాలని చాలా ఇష్టపడేవాడు.

వాళ్ళ వాళ్ళు అంతా ఇష్టపడినా, మల్లిఖార్జునరావు, గోవిందమ్మ ఇష్టపడలేదు, కుమార్‌కి చదువు తక్కువ అని. వాళ్ళు వేరే సంబంధాలు చూసుకుంటున్నారు.

ఒకరోజు కుమార్ హారితతో అన్నాడు –

"హారితా నీతో నేను ప్రత్యేకంగా మాట్లాడాలి."

"ఏమిటో చెప్పు!" అంది ఆశ్చర్యంగా.

"ఇప్పుడుకాదు. సాయంత్రం అలా ఎక్కడికైనా వెళ్ళి మాట్లాడుకుందాం" అన్నాడు.

ఇష్టం లేకపోయినా హారిత తల వూపింది, అలాగే వస్తానన్నట్టు.

ఆమె వస్తానని చెప్పగానే కుమార్‌కి చాలా సంతోషం అయింది.

ఆవేళ అంతా అతను ఉషారుగా తిరిగాడు.

సాయంత్రం ఇద్దరూ పార్కులో కలుసుకున్నారు.

అతన్ని అలా పార్కులో కలుసుకోవటం హారితకు అసలు ఇష్టంలేదు. కుమార్‌కి తను రాను అని చెప్తే చిన్నబుచ్చుకుంటాడనీ, ఎవరైనా తెల్సినవాళ్ళు చూస్తే ఏమనుకుంటారో అన్న భయం ఆమెను పీడించసాగింది.

"హారితా, నువ్వు నా మాటకు విలువ ఇచ్చి ఇలా రావటం నాకు చాలా సంతోషంగా వుంది." అన్నాడు ఆమెనే రెప్పవాల్చకుండా చూస్తూ.

"ముందు విషయం ఏమిటో చెప్పు!" అంది మాట మారుస్తూ.

"అదే, ఆ విషయం అడుగుదామనీ" అంటూ నసిగాడు.

"ఏ విషయం ?" అర్థంకానట్టు చూసింది.

"అదే మన పెళ్ళి విషయం. హారీ నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను నువ్వు కాదంటే నేను బ్రతకలేనేమో !"

హారిత ముఖం ఎర్రబడిపోయింది, అతను అంత సూటిగా తన మనసులో మాట చెప్తుంటే.

"చెప్పు హారీ ?"

"నా ఇష్టం ఏముంది అంతా అమ్మా, అన్నయ్య ఇష్టం" అంది మెల్లగా.

"నీకు నిజంగా ఇష్టం వుంటే వాళ్ళని ఒప్పించటం ఏమంత కష్టం కాదు."

హారిత మాట్లాడలేదు అసలు ఆమెకు అతన్ని చేసుకోవటం ఇష్టంలేదు.

"చెప్పు హారితా ?"

కొద్దిక్షణాలు మౌనం వహించి మెల్లగా చెప్పింది –

"నాకు ఇప్పట్లో పెళ్ళి చేసుకోవాలని లేదు కుమార్ "

"ఇప్పట్లో అంటే ఎన్నాళ్ళు ?" ఏదో అర్థం అయినట్టుగా అడిగాడు.

"రెండు మూడు సంవత్సరాల తరువాత చేసుకుందామని" తలవాల్చేస్తూ అంది, అసలు విషయం అతను ఎక్కడ పసిగట్టేస్తాడేమోనన్నట్టు.

కుమార్‌కి అర్థం అయినట్టు చిరునవ్వు నవ్వాడు.

"నీకు ఇష్టంలేదు అని చెప్పు – అంతేగాని ఇలా చెప్పటందేనికి ! అయినా నా పిచ్చి కాకపోతే నాలాటి వాడికి నిన్ను ఇచ్చి చేస్తారా ! ఏదో ఆశ చంపుకోలేక నిన్ను అడిగాను" అంటూ బాధపడ్డాడు.

అతను అలా బాధపడుతూంటే తనకి నిజంగా జాలేసింది. కాని తనేం చెయ్యగలదు !

కుమార్ ఆరోజు నుండి తనతో అంత ఎక్కువగా మాట్లాడకపోవటంతో తనూ తప్పుకు తిరిగింది.

నాల్గురోజులు వుండి వెళ్ళిపోయారు.

రమని చేసుకోమని మల్లిఖార్జునరావుని అడిగారు. అందుకు అతను ఇష్టపడలేదు.

ఆ తరువాత సంవత్సరం కుమార్‌కి, రమకి ఇద్దరికీ ఒకే నెలలో పెళ్ళిళ్ళు అయ్యాయి.

ఆ పెళ్ళికి హారిత వెళ్ళలేదు. మల్లిఖార్జునరావు, గోవిందమ్మ వెళ్ళారు. అదే సంవత్సరం

మల్లికార్జునరావుకి విశాలితో పెళ్ళి అయింది. అప్పటినుండి అంతగా వాళ్ళకి, తమకి రాకపోకలు లేవు.

ఇప్పుడు 'లీల పెళ్ళి కుదిరింది' అని చెప్పడానికి వచ్చారు శంకరం గారు. దగ్గర వుండి గోవిందమ్మను వెంటబెట్టుకువెళ్ళారు మెడ్రాస్.

ఇప్పుడు ఆ పెళ్ళికి హరిత వస్తేనేగాని వూరుకోం అని రమ వ్రాసింది. లీల కూడా వ్రాసింది.

వెళ్ళకపోతే బాగుండదని హరిత తప్పనిసరయి బయలుదేరుతోంది. కుమార్ ఎలా మాట్లాడతాడో? అప్పటి కోపం ఇంకా వుందేమో? అతని భార్య ఎలా వుంటుందో? సరిగ్గా మాట్లాడుతుందో, మాట్లాడదో? హరితకి అన్నీ ఆలోచనలే!

విశాలి, మల్లికార్జునరావు రాజమండ్రి పెళ్ళికి వెళ్ళడానికి వాళ్ళుకూడా సిద్ధం అవుతున్నారు. వాళ్ళు కారులో వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. హరితకు టికెట్ రిజర్వేషన్ చేయించేశారు. మర్నాడు ఉదయం కోరమండల్‌కి మెడ్రాసు వెళ్ళడానికి ఏర్పాటు అయింది. తెల్లవారి నాల్గు గంటలకు లేవడానికి అలారం పెట్టుకుంది.

అలారం కొట్టగానే హరిత లేచి తయారయింది సూట్‌కేస్ ఇవతల పెట్టి, హేండ్ బ్యాగ్ తీసుకుని భుజానికి తగిలించుకుంది.

మల్లికార్జునరావు కారులో చెల్లెల్ని స్టేషన్‌కి తీసుకువెళ్ళాడు.

## 2

ట్రైన్ రావటంతోనే మల్లికార్జునరావు ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్ చూసి చెల్లెల్ని అందులో ఎక్కించా .

నాల్గు బెర్తులు వున్న ఆ కూపేలో హరిత తప్ప ఇంకెవరూ లేరు. ఆమెకు కాస్త భయం కలిగినా పైకిమాత్రం ఏం అనలేదు.

మల్లికార్జునరావు పుస్తకాలు కొనితెచ్చాడు చెల్లెలికి.

''జాగ్రత్తగా వెళ్ళు! స్టేషన్‌కి ఎవరో ఒకరు వస్తారు. కంగారుపడకు.'' అంటూ పదిసార్లు హెచ్చరించాడు.

హరిత అన్నిటికి తలవూపి ది.

ఇక ట్రైన్ పదినిమిషాల్లో కదలబోతుంది అనగా మల్లికార్జునరావు చెల్లెల్ని మరోసారి హెచ్చరించి, తనకి ఏదో పని వుంది అంటూ ట్రైన్ ఇంకా కదలకుండానే వెళ్ళిపోయాడు.

హరిత పుస్తకం చేత్తోపట్టుకుని ప్లాట్‌ఫాం మీద నడుస్తున్న మనుష్యుల్ని చూస్తూ కూర్చుంది.

ట్రైన్ రానంతసేపూ రాలేదు అని అటూ ఇటూ తిరుగుతారు. ట్రైన్ రాగానే ఏ కంపార్ట్‌మెంట్ ఖాళీగా వుందా అని వెతుక్కుంటూ పరుగెడతారు.

హరితకు నవ్వు వచ్చింది.

ట్రైన్ కూతవేసి మెల్లగా కదలసాగింది. మెల్లగా కదులుతూ కూతవేస్తూ స్పీడ్ అందుకుంది.

'హమ్మయ్య! ఇప్పటికి కదిలింది' అనుకుంది.

# మువ్వల మురళి

హరిత చేతిలో వున్న పుస్తకం చూస్తూ కిటికీ దగ్గరగా కూర్చుంది.

ఫుల్ సూట్‌లో ఠీవిగా వున్న ఓ భారీ యువకుడు అదే కూపేలోకి అడుగుపెట్టాడు, చేత్తో సూట్‌కేస్ పట్టుకుని.

ఆ కూపేలో అడుగుపెట్టిన ఆ యువకుడు చూపులు ఒక్కక్షణం హరితమీద నిలిచి — మరుక్షణం తను కూర్చునే చోటువైపు దృష్టిని సారించాడు.

అతను చేతిలో సూట్‌కేస్ పైబెర్త్‌మీద పెట్టి — ఆమెకు ఎదురుగా కొద్దిదూరంలో కూర్చున్నాడు.

హరిత గుండెలు ఒక్కసారి గుబగుబలాడాయి. 'ఒక అపరిచితయువకుడితో ఈ కూపేలో ఒంటరిగా ప్రయాణం చెయ్యాలా!' అనుకుంది మనసులో భయంగా.

### దేశానికో పద్ధతి!

పశ్చిమ జర్మనీలో యీమధ్యనే ఆరోగ్య మంత్రి శాఖవారు కుటుంబనియంత్రణ— అనగా గర్భ నిరోధం మీద అనేక వివరణలు పద్ధతులు — బొమ్మలు గ్రుచ్చి — అచ్చువేసి విడుదల చేశారట!

అయితే యీ గర్భ నిరోధం కుటుంబ నియంత్రణం దృష్టిలోగాదు — పదారు సంవత్సరాలైన నిండకుండా ఆడపిల్లలు ''కుంతీదేవు''లైపోతున్నారన్న ఆందోళనతో — గర్భ నిరోధాన్ని ఎట్లా అమలు చెయ్యాలో తెలిపే యీ పుస్తకాన్ని సదరు మంత్రిత్వ శాఖవారు రిలీజు చేశారు అంటున్నారు.

కాని విద్యా మంత్రి శాఖ వారీ పుస్తకాన్ని చూసి గుండెలు బాదుకున్నారు. ఇది మరీ హద్దులుమీరి 'పచ్చి పచ్చి''గా వున్న వర్ణనలతోగలదు. గావున దీన్ని పాఠశాలలలోకి రానివ్వరాదు అని నిషేధించారుట!

అతను ఏ వూరు వెళ్తున్నాడో? మధ్యలో ఏ అనకాపల్లిలోనో దిగితే బాగుండును అని మనసులో వెయ్యి దేముళ్ళకి మొక్కుకుంది.

హరిత చూపులు అతని సూట్‌కేస్‌మీద నిలిచాయి. 'ఎన్. కృష్ణసుమంత్' అని వ్రాసి వుంది.

'ఓహో! ఈయనగారి పేరు కృష్ణసుమంత్ కాబోలు'' అనుకుంటూ— పుస్తకం చూస్తున్నట్టు నటిస్తూ, ఓరగా అతనివైపు చూసింది

''అతను దృఢంగా, ఆరోగ్యంగా, పొడుగ్గా, ఠీవిగా వున్నాడు. పచ్చని శరీరచ్ఛాయ, నొక్కుల క్రాప్, సొమ్ముల తొణికిసలాడే విశాలఫాలం, కోటేరు వేసినట్టు సూటిగా పొడుగ్గా వున్న నాసిక, ప్రపంచంలో సౌహార్దము సంతటినీ స్వంతం చేసుకుని నవ్వుతున్నట్టు వుండే కళ్ళు, పెదవులు కాస్త మోటుగా వున్నప్పటికి తీర్చిదిద్దినట్టుగా అందంగా వున్నాయి. పచ్చని ఛాయగల అతనికి బుల్గ్రేవ్ కళ్ళద్దాలు ముఖానికి చక్కగా నప్పాయి. బ్లాక్ మొస్టేచ్ దిద్దినట్టు వున్నాయి.

గ్రే కలర్ ఫుల్ సూట్‌లో వున్నాడు. మెడలో ఎర్రరంగుపై తెల్లని చుక్కలు వున్న టై గాలికి ఒయ్యారంగా కదులుతూంది. కాలు మీద కాలు వేసుకుని వెనక్కి చేరబడి దర్జాగా కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు.

కాలుమీద కాలు వేసుకుని వెనక్కి చేరబడి కూర్చోవటంలో రాజఠీవి ఉట్టిపడుతోంది.

అందరి పురుషుల్లో ఈ ఠీవి కనిపించదు. పొడుగ్గా వున్నవాళ్ళు తేగ తొక్కల్లా మెడలు క్రిందకు వంచేసి నీరసంగా నడుస్తారు. అందంగా వున్నవాళ్ళు పొట్టిగా వుంటారు. బక్కపల్చగా వున్నవాళ్ళకి అందమైన నొక్కుల క్రాఫ్ వుంటుంది

అందం, ఆకర్షణ, ఠీవి వున్న పురుషులు నూటికి కోటికి ఒకరు వుంటారు. ఆ ఒక్కరులో ఈ కృష్ణసుమంత్ ఒకడు.'' అని అనుకోకుండా వుండలేకపోయింది హరిత ఆ సుందర యువకుడ్ని చూస్తూ

అతని వయసు ముప్పైఐదు సంవత్సరాలు దాటి వుంటాయి. చూడగానే కాస్త పెద్దవయసు వున్నట్టుగా కనిపిస్తాడు.

ఓరగా అతన్నే చూస్తున్న ఆమె చూపులు తప్పుకోలేకపోయింది.

ట్రైన్ చకచకమంటూ పరుగులు పెడుతోంది.

పేపరు చదువుతూ కాలుమీద కాలువేసుకుని కూర్చున్న అతను, ట్రైన్ పరుగులు పెడుతుంటే ఆ కుదుపులకి కాస్త వూగుతూన్నా, అతనిలో ఓ విధమైన ఠీవి ఒలికి పోతోంది.

''అబ్బ! ఈయన ఎవరోగాని మనిషిలో ఏం ఆకర్షణ. ఎంత చక్కగా వున్నాడు'' అనుకుంది మనసులో.

హరిత పుస్తకం చదువుతున్నా, అక్షరాలకి బదులు అతని రూపమే పుస్తకం ప్రతీ పేజీలో కనిపించసాగింది.

ఆమెకు నవ్వు వచ్చి తనలోతాను నవ్వుకుంది.

అతను అప్రయత్నంగా పేపర్‌లోనుండి తల యెత్తి ఆమెవైపు చూశాడు. ఆమె ఎందుకో తనలోతాను నవ్వుకోవటం కనిపించి అతనుకూడా చిరునవ్వుతో —

అప్రయత్నంగా అదే సమయంలో హరిత కూడా తలయెత్తి చూసింది. ఇద్దరి చూపులు ఒక్కసారిగా పెనవేసుకుపోయాయి. క్షణంసేపు అతని కళ్ళు స్నేహపూర్వకంగా నవ్వాయి.

ఆమె అతని చిరునవ్వు చూసి మనసులో కంగారుపడినా పైకి బింకముగా కూర్చుంది.

''నువ్వు ఎవరు? నన్నుచూసి తెలుసున్నట్టుగా నవ్వుతున్నావ్! నా సంగతి ఇంకా నీకు తెలియదులా వుంది.

ఈ [illegible] అని గ్రహించుకో'' అన్నట్టు చూసింది ఆమె చూపులు

పదునైన కత్తుల్లావున్నాయి. రోషంతో ముఖం ఎఱ్రబడింది.

ఎఱ్రగా కందిపోయివున్న ఆమె వదనం తమాషాగా, అందంగా కనిపించింది. అతని కళ్ళకి మనోహరంగా కనిపించటమే కాకుండా, కృష్ణ సుమంత్ మనసులో ఎప్పటికీ చెరగరానంత గాఢంగా ముద్రవేసింది.

ఆమెవైపు పరీక్షగా, రెప్పవాల్చకుండా చూసాడు క్షణంసేపు –

బంగారు శరీరచ్ఛాయతో సన్నగా, నాజూగ్గా, పొడవుగా, రివటలాగుంది. విశాలనేత్రాలు, నునుపైన చెక్కిళ్ళు, సన్నగా తీర్చిదిద్దినట్టు వుండే కనుబొమ్మలు, సన్నటి ఎఱ్రని పెదవులు, ఉంగరాలజుత్తు, బాగా పొడవుగా వున్న జడ, చెవులకి పెద్ద పెద్ద రింగులు, ఎడంచేతికి రవుండ్ వాచీ, కుడిచేతికి బంగారు గాజులు, మెడలో పెద్ద లాకెట్‌తో సన్నటి గొలుసు. ఆమె ముఖం సీరియస్‌గా పెట్టుకుని పుస్తకంచదువుకుంటోంది.

"ఈ అమ్మాయి పేరు ఏమిటో? ఇంత అందమైన అమ్మాయికి చక్కని పేరు కూడా వుంటే మరీ బాగుంటుంది." అనుకున్నాడు మనసులో.

హరిత మెల్లగా తలయెత్తి ఓరగా చూసింది అతనివైపు.

కృష్ణసుమంత్ అటే చూడటంతో మరొక్కసారి ఇద్దరి చూపులు కల్సుకున్నాయి.

అతను చిరునవ్వు నవ్వాడు.

'అరే! అలా చూడటంతో అతనికి దొరికి పోయానే' అని, తనని తాను తిట్టుకుంది.

కృష్ణసుమంత్ పేపర్ మడిచి పక్కన పడేసి కోటు తీసి సూట్‌కేస్‌మీద పెట్టి,ఆమెకు ఎదురుగా కూర్చున్నాడు.

హరిత గుండెలు ఒక్కసారి దడదడ కొట్టుకున్నాయి. కళ్ళు భయంతో రెపరెపలాడాయి. కొద్దిగా జంకినట్టుగా చూసింది అతనివైపు.

"బాప్‌రే! అమ్మాయిలు కళ్ళతో ఎన్ని భాషలు మాట్లాడగలరు. నచ్చినవాళ్ళని కళ్ళతోనే మెచ్చుకుంటారు. నచ్చనివాళ్ళని కళ్ళతోనే అసహ్యించుకుంటారు. వట్టి చూపులతో ఏ పని అయినా చిటికెలో సాధించేస్తారు. అమ్మాయిలకు వచ్చిన కళ్ళ భాషలు మరే పురుషుడికి రావు. ఆ భాష అర్థంకాక తెల్లముఖం వెయ్యవలసిందే."

ఆమెవైపు ఆసక్తిగా చూస్తూ ప్యాంట్ జేబులో కర్చీఫ్ తీసి, కళ్ళ అద్దాలు తీసి ముఖం కర్చీఫ్‌తో తుడుచుకుని మళ్ళీ అద్దాలు కళ్ళకి యథాప్రకారం పెట్టుకున్నాడు.

హరితకు అతన్ని చూస్తుంటే ఒళ్ళు మండింది. పైకి పెద్దమనిషిలా కనిపిస్తున్నాడు. ఒంటరిగా ఆడపిల్ల కనిపించగానే కళ్ళు అప్పగించి మతిపోగొట్టుకున్నట్టు చూస్తున్నాడు. మనసులో కసిగా అనుకుంది.

"వెల్ వేర్ ఆర్ యు గోయింగ్?" అంటూ ఎంతో మర్యాదగా ప్రశ్నించాడు.

అతను అలా అడగ్గానే ఎఱ్రగా చూసింది, నేను ఏ వూరు వెళితే నీ కెందుకు అన్నట్టు

"అబ్బా! ఈ అమ్మాయి మాటలకి లొంగే రకంకాదు" అనుకున్నాడు.

ట్రైన్ రాజమండ్రిలో ఆగటంతో హరిత టీ మాత్రమే త్రాగింది.ఆ కూపేలోకి ఇంకెవ్వరన్నా వస్తే బాగుండును అనుకుంది. ఇంకెవ్వరూ రాలేదు.

'ఈ మహానుభావుడు ఏ స్టేషన్‌లో దిగుతాడో గాని చూపులతో చంపేస్తున్నాడు' అనుకుంది. "ఆకతాయివాళ్ళ ఎదురుగా, చవటల్లా వున్నవాళ్ళ ఎదురుగా ఎంత దర్జాగా అయినా కూర్చోవచ్చుగాని ఏమిటో ఇంత హుందాగా, అందంగా వున్న పురుషుల ఎదురుగా లక్ష్యములేనట్లు కూర్చోవాలంటే ఏమిటో ఇబ్బందిగా వుండటమే కాకుండా, శరీరం అంతా కుంచించుకు పోతున్నట్లుగా వుంటుంది.

ప్రతీ అందమైన యువకుడు అమ్మాయిల మనసులో చోటు చేసుకోలేడు. అందమైన అమ్మాయి మనసులో ఒకేఒక సుందర యువకుడికి చోటు లభిస్తుంది."

హరిత అతన్ని లెక్కచెయ్యనట్టు బింకముగా కూర్చున్నా, మనసు మాత్రం మెత్తబడిపోయి కృష్ణసుమంత్ గురించే ఆలోచించసాగింది. అతని అందచందాలు మనసుని ఆకర్షించినా, హరితకు జడిసి మనసు మౌనంగా నోరుమూసుకు కూర్చుంది.

సాయంత్రం నాల్గు గంటలు అవుతూంది. స్టేషన్‌లో ట్రైన్ ఆగింది.

హరిత చదువుతున్న పుస్తకం పక్కన పెట్టింది. కిటికీలో నుండి చూస్తూ కూర్చుంది.

అతను ఆమెవైపు క్షణంచూసి కాఫీ తీసుకుందామని కిటికీవైపు చూశాడు రెండు నిముషాల తరువాత – అతను కాఫీ, టిఫిన్ తెప్పించి ఆమెకు కూడా ఇవ్వబోయాడు. హరిత తీసుకోలేదు. మృదువుగానే వద్దు అని చెప్పేసింది. అతను మరి బలవంతం చెయ్యలేదు.

ట్రైన్ ఆ స్టేషన్ వదిలి మళ్ళా ముందుకి కదిలింది.

హరిత టవల్, సోప్‌బాక్స్ తీసుకుని బాత్‌రూమ్‌కి వెళ్ళింది. చల్లటి నీళ్ళతో ముఖం కడుక్కుంటే హాయిగా అనిపించింది.

ఎయిర్ బ్యాగ్‌లో టవల్, సోప్‌బాక్స్ యథాప్రకారం పెట్టేసి హ్యాండ్‌బ్యాగ్ తెరిచి పౌడరు రాసుకుని, బొట్టు పెట్టుకుంది. లిప్‌స్టిక్ వేసుకోవటం ఎలా' అతను ఎదురుగానే కూర్చుని చూస్తున్నాడు. లిప్‌స్టిక్ వేసుకోవటం తప్పు అని కాదు. ఏమిటో అతని ఎదురుగా పెదవులకి రంగు వేసుకుని ముస్తాబవటం సిగ్గుగా అనిపిస్తుంది. వేసుకోవటం అలవాటు అయిపోయింది.

పౌడర్ వేసుకున్నట్లు నటిస్తూ అతనివైపు ఓరగా చూసింది. అతను చిన్న నోట్‌బుక్‌లో ఏమిటో వ్రాసుకుంటున్నాడు. ఇదే సమయం అని హరిత పెదవుల లైట్‌గా లిప్‌స్టిక్ వేసుకుని బ్యాగ్ మూసేసింది.

కృష్ణసుమంత్ కళ్ళ పడకూడదని ఆమె ఎంత అనుకుందో, అతని కళ్ళ పడనేపడింది. వ్రాసుకుంటూనే చూసినా చూడనట్టే వూరుకున్నాడు.

"ఆడపిల్ల అయి పుట్టిన తరువాత ప్రతీ ఆడపిల్లకి ఇలాటి సరదాలు వుంటాయి. చక్కగా ముస్తాబు అవ్వాలని, తలనిండా పువ్వులు పెట్టుకోవాలని, మంచి చీరలు కట్టుకోవాలని ఎన్నెన్నో కోరికలుంటాయి.

ఆడపిల్లకు ఎన్నో సరదాలు వుంటాయి. కళకళలాడుతూ ఇంట్లో తిరుగుతుంది. అందుకే ఆడపిల్ల ఇంటికి లక్ష్మి. 'ఒక్క ఆడపిల్ల అయినా లేదు' అని తల్లిదండ్రులు అప్పుడప్పుడూ విచారిస్తుంటారు" అనుకున్నాడు మనసులో.

కృష్ణసుమంత్ తల్లిదండ్రులకి ఒక్కడే కొడుకు. అతనికి అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు ఎవ్వరూ లేరు.



హరితనిలబడి ఎయిర్‌బ్యాగ్ సర్దుకుంటోంది. అతను వ్రాసుకుంటున్నాడు.

ట్రైన్ ఏదో కారణంచేత ముందుకువెళ్తూ సడన్‌గా ఆగి వెనక్కి వెళ్ళసాగింది

ట్రైన్ సడన్‌గా ఆగటంతో నిలబడి వున్న హరిత ఆ వూపుకి ఆగలేక కృష్ణసుమంత్ ఒడిలో పడింది. అతను కంగారుగా ఆమెను పొదివి పట్టుకున్నాడు. ట్రైన్ ఇక వెనక్కు వెళ్ళటం మాని పది నిముషాలపాటు ఆగిపోయింది.

అతని చేతిలో పెన్ను, పుస్తకం జారి క్రింద పడిపోయాయి.

హరిత వదనం సిగ్గులో, అవమానంతో ఎర్రబడిపోయింది. లేచి సరిగ్గా నిలబడింది. ట్రైన్ ముందుకి కదిలి స్టేషన్‌లో ఆగింది.

అతనుకూడా ఆమెవైపు సరిగ్గా చూడలేక పోయాడు. ఏమనుకుంటోందో అన్నట్టుగా చూడకుండా వుండలేక హరితవైపు క్రీగంట చూశాడు.

ఆమె వదనం ఎర్రగా కందిపోయినట్టుగా వుంది సీట్లో బుద్ధిమంతురాలిలా కదలకుండా కూర్చుంది.

'ఆమె సిగ్గుపడి ముఖం చూపించలేకపోతూంది' అని తలచి మౌనంగా కూర్చున్నాడు కృష్ణసుమంత్ ముఖంకూడా గంభీరంగా మారిపోయింది.

ట్రైన్ అలా పరుగులు పెడుతూనేవుంది.

ఆమె అసలు తలతిప్పి చూడలేదు. అతనూ పలకరించలేదు.

ట్రైన్ సాయంత్రం ఆరున్నర ఏడుగంటల మధ్య మెడ్రాస్ స్టేషన్‌లో ఆగింది.

హరిత తనకోసం స్టేషన్‌కి ఎవరైనా వచ్చారా లేదా అని కంగారుగా చూసింది.

ఆమె కళ్ళకి కుమార్ ప్లాట్‌ఫాంమీద నడుచుకు ఇటే రావటం కనిపించింది.

హరిత అతన్ని చూడగానే, "కుమార్" అని సంతోషంతో కేకవేసింది.

కృష్ణసుమంత్ కోటు చేతిమీద వేసుకుని, సూట్‌కేస్ చేత్తో పట్టుకుని ట్రైన్ దిగబోతున్న వాడల్లా, ఆమె కేకకి ఒక్కసారి కళ్ళుతిప్పి ఆమె వైపు ఇటే వస్తున్న కుమార్‌వైపు చూశాడు, ఎవరా కుమార్ అన్నట్టు!

ఆ కుమార్ అన్న అతను సంతోషంగా 'హరితా!' అని దగ్గరగా వచ్చాడు.

కృష్ణసుమంత్ చూపులు తిప్పేసుకుని చకచక అడుగులు వేస్తూ ముందు గబగబ వెళ్ళిపోయాడు.

హరిత ట్రైన్ దిగి ప్లాట్‌ఫాంమీద నడుస్తూంది. కుమార్ సూట్‌కేస్, ఎయిర్‌బ్యాగ్ చేత్తో పట్టుకుని ముందు నడుస్తున్నాడు

హరిత నడుస్తున్నా మనసు, కళ్ళు 'అతని' కోసం వెతకసాగాయి. కృష్ణసుమంత్ ఎక్కడా కనిపించలేదు.

కుమార్ ఆమెను టాక్సీలో ఇంటికి తీసుకువెళ్ళాడు.

3

హరిత నిద్రపోయి ఉదయం ఎనిమిది గంటలకి లేచింది.

# మువ్వల మురళి

తల్లి గోవిందమ్మ కూతుర్ని లేపి స్నానం చేసి రమ్మంది.

హరిత బద్ధకంగా బట్టలు తీసుకుని బాత్‌రూమ్ వైపు వెళ్ళింది. ట్రైన్ ప్రయాణం చేసి వచ్చిందేమో నీర్సంగా వుంది. ఆమె అర గంటలో స్నానం చేసి ముస్తాబు అయి కాఫీ, టిఫిన్ తీసుకుని తీరిగ్గా రమ, లీలలో కబుర్లు చెబుతూ కూర్చుంది.

కుమార్ భార్య శైలజ కూడా కలుపుగోరుతనంగా మాట్లాడటం హరితకు నచ్చింది.

శైలజ పెద్ద అందంగా వుండకపోయినా అందంగానే వుంటుంది. కుమార్ శైలజలకి ఒక కూతురు. సంవత్సరం రెండు మాసాలు ఆ అమ్మాయికి.

కుమార్ మునుపటి విషయాలు ఏమీ మనసులో పెట్టుకోకుండా హరితతో మామూలు మనసుగానే మాట్లాడుతున్నాడు.

రమ తన భర్త గురించి చాలా కోతలు కోసి చెప్తుంది. ఆ చెప్పటంలో "నీ అన్న నన్ను చేసుకోపోయినంత మాత్రాన నేను ఏం సుఖపడలేను అనుకున్నావా! నా భర్త నన్ను ఎంతో ప్రేమగా చూస్తున్నారు. నేను సుఖంగా వుంటున్నాను" అన్నట్లు వున్నాయి ఆ మాటలు.

## మెల్లకన్నుకి మందు!

మెల్లకన్ను వున్న పిల్లలకి చికిత్స ఎట్లాగా? అనుకునే తల్లిదండ్రులు - వాళ్ళని టెలివిషన్ చూస్తూ కూర్చోవద్దు అని కసరకండా వుంటే చాలు. మెల్లకన్ను గల పిల్లలు టెలివిజన్ చూస్తే వాళ్ల కన్ను సరిగ్గా అయ్యే అవకాశాలు వున్నాయని – పశ్చిమజర్మనీ కంటి నిపుణులు ఒకరు ప్రకటించారు. అయితే అసలు సంగతి ఒకటి వుంది. రెండు కళ్లతోనూగాక, కేవలం మెల్ల వున్న కన్నుతోనే ఏ పది నిమిషాలు టెలివిజన్ చూడటం పిల్లలు ప్రాక్టీస్ చెయ్యాలట!

హరిత ఆవేం గ్రహించనట్టు చిరునవ్వుతో వింటూంది ఆమె మాటలు.

లీల పెళ్ళి రాత్రి పన్నెండు గంటలకి. లీల భర్త ఆ వూళ్ళోనే ఉద్యోగం చేస్తున్నాడు. తల్లిదండ్రులది కూడా ఆ వూరే.

పెళ్ళికి వచ్చిన బంధువులతో ఇల్లు అంతా చాలా హడావుడిగా వుంది. రాత్రి భోజనాలు అయ్యాయి. పెళ్ళి టైము దగ్గర అవుతూంది.

హరిత ముదురు ఆకుపచ్చ చీరకి గులాబీరంగు బోర్డరు. బోర్డర్‌కి రెండువైపులా జరీ వుంది. చీరంతా జరీగడి ముదర ఆకుపచ్చ జాకెట్ వేసుకుంది. చెవులకి ముత్యాల జూకాలు, మెడలో పెద్ద పతకంతో ముత్యాలహారం, చేతికి ముత్యాల గాజులు, ముత్యాల వుంగరం, ఎడంచేతికి వాచీ, నుదుట ముదురు ఆకుపచ్చ శింగార్ తిలకం, కళ్ళకి కాటుక రేఖలు తీర్చిదిద్దింది. పెదవులకి లైట్‌గా లిప్‌స్టిక్ వేసుకుంది. ఉంగరాలజుత్తులో పెద్దగా పొడుగ్గా వున్న జడతో హరిత అందంగా మెరిసిపోతోంది, ఆ లైట్ల వెలుగులో.

లీలని ముస్తాబుచేసి పెళ్ళిపీటలమీదకు తీసుకువెళ్ళారు.

పెళ్ళికి చాలామంది వచ్చారు

పెళ్ళికొడుకుని చూడగానే బాగానే వున్నాడు అనుకుంది హరిత.

పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు.

రమ, హరిత హడావుడిగా తిరుగుతున్నారు.

కుర్చీలు ఖాళీలేక చాలామంది నిలబడి పోయారు.

అటుగా వెళ్తున్న హరిత ఒక్క క్షణం బొమ్మలా అలాగే నిలబడిపోయింది. పాదాలు నేలకు అంటుకుపోయాయి. అక్కడ అందరితో బాగా పొడుగ్గా, అందంగా వున్న అతనిపై ఆమె దృష్టి నిలిచిపోయింది క్షణంసేపు.

కృష్ణసుమంత్ ముఖం గంభీరంగా వున్నా, పెదవులు మాత్రం చిరునవ్వుతో విచ్చుకోబోయి ఆ ప్రయత్నం విరమించుకున్నట్లు బిగబట్టుకున్నాయి.

'అతన్ని మళ్ళీ చూశాను' అన్న సంతోషం ఆమెలో కలిగినా – ట్రైన్‌లో సంఘటన గుర్తుకు వచ్చి అవమానంతో హరిత ముఖం ముడుచుకు పోయినట్టు అయి, కనుబొమ్మలు ముడిపడ్డాయి. 'ఇతను మళ్ళీ ఇక్కడ ఎందుకు కనిపించాడురా బాబూ!' అన్నట్టు.

కృష్ణసుమంత్ చేతులు కట్టుకుని ఠీవిగా నిలబడ్డాడు.

హరిత అతను ఎవరో అన్నట్టు మామూలుగా తిరగసాగింది.

మగపెళ్ళివారితో వచ్చిన ఒకావిడ హరిత ఇటూ అటూ తిరుగుతూంటే ఆమెవైపే ముచ్చటగా చూడసాగింది. హరితను పిల్చి, దగ్గర కూర్చోబెట్టుకుని 'పేరు ఏమిటి?' అని అడిగింది.

ఆమె చిరునవ్వుతో పేరు చెప్పింది.

'ఎంతవరకు చదువుకున్నావు?' అని అడిగితే పి. యు సి. అని చెప్పింది.

"ఎవరి అమ్మాయివి? మీ నాన్నగారి పేరు ఏమిటి? అక్కచెల్లెళ్ళు ఎంతమంది? అన్నదమ్ములు ఎంతమంది?" అని వివరాలు అడిగింది.

హరిత ఆ ప్రశ్నలన్నిటికి ఓపిగ్గా జవాబు చెప్పింది.

ఆవిడ భర్తని పిల్చి హరితను చూపిస్తూ చెప్పింది – 'శంకరరావుగారి చెల్లెలు కూతురుట! వైజాగ్‌లో వుంటున్నారుట!" అని.

బలభద్రరావుగారు ఆమెవైపు చిరునవ్వుతో అలాగా అన్నట్లు చూశారు "వచ్చిన దగ్గర్నుండి చూస్తున్నాను ఈ అమ్మాయి ఎవరా!" అని అన్నారు.

ఆయన మాటలకి హరిత కొద్దిగా సిగ్గుపడి తలవంచుకుంది.

విజయమ్మ భర్తవైపు చూసింది. అమ్మాయి ఎలా వుంది అన్నట్టు –

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

సి. వి. ఆర్. ఎమ్. — బొబ్బిలి.

మల్లెతీగ వంటిదీ నగువ జీవితం. బట్ మగవాడనే పిల్లని పందిరలేందే అల్లుకోలేదు కదా?

★ మల్లెపొద చూడలేదా ఎప్పుడూ? గుబురుగా పెరిగి వాసనలు వెదజల్లే మల్లె మొక్కలు — కుటుంబాలకి — కుటుంబాలని పోషిస్తున్నాయి.

ఎస్. ఆర్. — సికింద్రాబాదు.

అనాధ శరణాలయములోని అమ్మాయిని తెచ్చి పెంచుకోవాలని వుంది. కాని ధైర్యం చాలడం లేదు. ఏం చేయాలన్నా తోచడం లేదు?

★ సారీ, నేను చాలా వుత్సాహంగా యిదివరకు మీ హైద్రాబాదులోనే ఒక స్నేహితురాలను కొన్న స్త్రీకి — భార్యా భర్తలు సమ్మతిపై — ఎట్ట సమ్మతమైన రీతిగా పెంచుకొందుకు పిల్లని చూసుకొందుకు ఏర్పాట్లన్నీ చేసిపెట్టాను. తీరా వాళ్ళు ఏమన్నారో తెలుసా? రామలక్ష్మి లంచం తీసుకొని పిల్లని పెంచుకుందు కిప్పించిందని! సంఘ సేవకికూడా యిలాంటి లాలూచీలు అంటగడతారని అప్పుడే తెలిసింది నాకు! దయచేసి మీరు విడిగా వుత్తరం రాస్తే — నేను బాలమందిర్ కి అందిస్తాను. వారితోనే — ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి. దిక్కులేని చంటిపిల్లలున్నారక్కడ.

పి. ఎస్. ఆర్. — తీన్‌సుకియా.

జీవితంలో అన్నీ అనుకున్నట్టే జరిగితే — మానవునికి అపజయం అంటూ వుండేదికాదు. నా విషయంలో అదే జరిగింది ...

★ అనుకున్నాను! — తన ముక్కు దాటి ప్రపంచం లేదనే సాదా మానవుని దృష్టి! అందుకే తన సుఖాన్ని మించిన సుఖం — తన కష్టాన్ని మించిన కష్టం వుండదని అంచనా వేసుకుంటాడు.

స్నేహానికి నిర్వచనం తెలియనివారికి మీరిచ్చే సమాధానం ఏమిటి?

★ సుఖంగా వాళ్ళనైనా బ్రతక నివ్వమని.

ఎమ్. ఆర్. ఆర్. — న్యూఢిల్లీ.

నా రూంమేట్ ఒకడున్నాడు. నేను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు అంటాడు. అలాంటి వారికి బుద్ధి చెప్పడం ఎలా?

★ అవుననడమే!

చంద్రశేఖర్ — ఆదోని.

సృష్టిలో అబ్బాయిల కంటే అమ్మాయిలే అందంగా వుంటారు ఎందుకని?

★ సృష్టికి ప్రతిసృష్టి చేయాలి కదా? అందుకని.

వి. వి. — మద్రాసు.

కొందరు మిమ్మల్ని తిట్టుకుంటారెందుకు?

★ నాలాగా నిర్మొహమాటంగా వుండలేక

పి. ఏ. ఆర్. — హాస్‌పేట.

ఈ సంవత్సరం ప్రభుత్వ బహుమతులలో నిర్మాతలు, దర్శకులు, సంగీత దర్శకులు, గాయనీ గాయకులు అందరికీ యిచ్చారు. ముఖ్యముగా ఉత్తమ సాహిత్యానికి — పాటలు మాటల రచయితలకు మరచిపోయారు. ప్రభుత్వం దృష్టిలో సాహిత్యానికి విలువలేదా?

★ చలనచిత్ర రంగంలో ప్రారంభ దశలోనే రచయితకి విలువ. తరువాత పోపులో కరివేపాకు. లాగా అడ్డం తగులుతారని దూరంగా వుంచుతారు!

ఎస్. ఐ. బి. — గుడికల్లు.

చనిపోవడం అంటే?

★ బ్రతికి బయటపడ్డమే!

---

'అమ్మాయికే చక్కగా వుంది' అన్నట్టు కళ్ళతోనే చెప్పారు ఆయన.

"నాకు కోడలిగా ఇలాటి అమ్మాయే రావాలి. ఈ అమ్మాయి నాకు ఎంతో నచ్చింది" అన్నట్టు కళ్ళతోనే చెప్పింది ఆవిడ.

బలభద్రరావుగారు చిరునవ్వు నవ్వారు.

"తొందరపడకు! ఈ అమ్మాయే నీకు కోడలు అవుతుందేమో?" అన్నట్టు ఆ నవ్వులో అర్థం స్ఫురించింది.

పెళ్ళితంతు ముగిసింది. పీటలమీదనుంచి పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు లేచారు.

హరిత ఆలోచనలు అన్నీ కృష్ణమూర్తి చుట్టూరా తిరగసాగాయి. పెళ్ళికొడుక్కి అతను ఏమౌతాడు? అతని భార్య కూడా వచ్చిందా? వస్తే తనని ఖచ్చితంగా చూపిస్తాడు. 'ఈ అమ్మాయే బ్రెయిన్ కుదువుకి నామీద తూలపడింది అని' చెప్పకుండా వుంటాడా? ప్రతి పురుషుడు భార్యకు అన్ని విషయాలు దాపరికం లేకుండా చెప్పేస్తాడు.

హరితకు తల్చుకుంటే ఏడ్పు వచ్చినంత పని అయింది. పెళ్ళికి వచ్చినవాళ్ళు అంతా ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు. హరిత నేత్రాలు ఆ సుందరమూర్తి కోసం గాలించాయి. ఎప్పుడు వెళ్ళిపోయాడో ఎక్కడా కనిపించలేదు. ఎందుకో ఆమె తేలిగ్గా నిట్టూర్చింది.

మర్నాడు పెళ్ళివాళ్ళు విడిదింట్లో కొద్దిమంది వున్నారు. అతనుగాని వున్నాడేమో అనుకుంది కాని ఎక్కడా కనిపించలేదు.

పెళ్ళి అయిన మూడవ రోజున హరిత వైజాగ్ వెళ్ళిపోతాను అంటే — మరో రెండు రోజులు వుంటేనేగాని వెళ్ళనిచ్చేదిలేదంటూ అంలా పట్టుపట్టారు.

గోవిందమ్మ కూడా త్వరగా వెళ్ళి పోదామనుకున్నా అన్నగారు, వదినగారు వెళ్ళనివ్వలేదు.

హరిత, గోవిందమ్మ రేపు వైజాగ్ వెళ్ళిపోతారు అనగా —

శైలజ హరితని తీసుకుని తెల్సిన వాళ్ళింటికి వెళ్ళింది.

శైలజకి పెళ్ళికొడుకు — పెత్తల్లికొడుకు.

మగపెళ్ళివారు, వాళ్ళ బంధువులు అంతా శైలజకి తెల్సిన వాళ్ళే.

పెళ్ళిలో హరితని చూసి, ఆ అమ్మాయిని వెళ్ళిపోయేముందు మా ఇంటికి తీసుకు రమ్మని శైలజకు చెప్పింది, తెల్సినావిడ.

ఆటో వాళ్ళ ఇంటి ముందు ఆగింది.

శైలజ వెంట హరిత ఇద్దరూ గేటు తీసుకుని లోపలకు వెళ్ళారు.

వాళ్ళదిచాలా పెద్ద బంగళా, బలభద్రరావుగారు మద్రాసులో పెద్ద వాణిజ్య నేత.

ఆయన వ్యాపారంలో లక్షలు లక్షలు గడించారు. ఆయనకు మద్రాసులో మంచి పేరు వుంది. ఆ వూళ్ళోనే మరో రెండు ఇళ్ళు వున్నాయి. బలభద్రరావుగారిది చాలా మంచిమనసు. ఆయన భార్య విజయమ్మది కూడా మంచిమనసే! ఎవరికి ఎలాటి సాయం అయినా సరే చేస్తారు.

హరితను, శైలజను చూడగానే ఆవిడ చిరునవ్వుతో ఆప్యాయంగా లోపలకు తీసుకు వెళ్ళింది.

ఆవిడ్ని చూడగానే హరిత ప్రాణం ఒక్కసారి ఎగిరిపోయినట్టు అయింది. పెళ్ళిలో అంతసేపు, అన్ని ప్రశ్నలతో వేధించిన ఆవిడా! ఇంకెవరి ఇంటికో అనుకుంటూంది! ఇది వీళ్ళ ఇల్లు అని తెలిస్తే తను చస్తే రాకపోను

ఆవిడ తనవైపు కళ్ళు ఆర్పకుండా అలాగే చూడటం తనకి ఆరోజు చాలా సిగ్గేసింది.

విజయమ్మ వీళ్ళ రాకకి చాలా పొంగిపోయింది.

ఆవిడ వీళ్ళిద్దర్నీ ఇల్లు చూడమంది. తను వంటమనిషికి ఏదో చెప్పడానికి వెళ్ళింది

శైలజకు ఆ ఇల్లు ఏమీ కొత్తకాదు కాబట్టి హరితను తీసుకుని మేడమీదకు వెళ్ళింది.

ఆమెకు ఒక్కో గదీ చూపించింది. "అదిగో ఆ మూలగా వుందే అది లైబ్రరీ రూమ్" అని చెప్పింది.

'లైబ్రరీ రూమ్' అనగానే హరిత మనసు వువ్విళ్ళూరింది.

అక్కడ వున్న ఆ పుస్తకాన్ని అరగంటలో అన్నీ నమిలిమింగేద్దామన్నంత ఆశ కలిగింది.

"ఒకసారి వెళ్ళి చూడొచ్చా?" అడిగింది.

"ఓ! నీకు ఏం పుస్తకాలు కావలిస్తే ఆ పుస్తకాలు తీసుకో" అంది శైలజ.

"నువ్వూ రా..." అంది.

"ఉహూఁ! నువ్వు వెళ్ళు. నాకు ఆ పుస్తకాలు కళ్ళతో చూస్తేనే వచ్చేస్తుంది తలనొప్పి. నేను అత్తయ్యగారితో మాట్లాడతాను, నువ్వు వెళ్ళి చూసుకో."

హరిత ఆవిడ ఏమనుకుంటుందో అని సందేహిస్తూ నిలబడిపోయింది.

"ఆవిడ ఏం అనుకోరు. చాలా మంచావిడ తెల్సా? వెళ్ళు. నీకు ఏ పుస్తకాలు కావాలో తీసుకో!" అంది ఆమె సందేహిస్తోంది అని గ్రహించి.

హరిత తలవూపి లైబ్రరీ రూమ్ వైపు వెళ్ళింది.

శైలజ మేడ దిగి క్రిందకు వెళ్ళింది.

హరిత మెల్లగా లైబ్రరీ రూమ్‌లోకి అడుగు పెట్టింది —

/ ఇంకా వుంది /



'మానవుడు–మహనీయుడు'లో రీనా, శోభన్‌బాబు

# సినిమా విశేషాలు

## సిరిమల్లె నవ్వింది'లో నవ్వించిన ప్రసాద్

సరస్వతి (సుజాత) రోడ్డుమీద నడుస్తోంది. సైకిల్‌మీద సరస్వతిని దాటి ముందుకు వెళ్ళిన ప్రసాద్ (కృష్ణ), హఠాత్తుగా సైకిల్ ఆపి దిగి, ఏదో రిపేర్ చేస్తున్నట్లుండిపోయాడు. సరస్వతి సమీపించగానే "హలో, మీరా! మీరు టీచరవని నాకు తెలీదండి," అంటూ సైకిల్‌ని తోసుకుంటూ ఆమె వెంట నడవసాగాడు.

"ఇప్పుడు తెలుసుకున్నారుగా? సూర్యారావు గారింట్లో అది తెలుసుకోవడం కోసం మీరు పడ్డ పాట్లు, చేసిన ఫీట్లు నేను చూస్తూనే ఉన్నాను," అంది సరస్వతి నవ్వుతూ.

"చూసేశారా? అరే! మీరు చాలా తెలివైన వారండి. అందుకే మీరు టీచరయ్యారు. సూర్యారావుగారు మా బావేనండి. సుశీల మా పెద్దమ్మ కూతురు. 1956 లో వాళ్ళ పెళ్ళయింది. 60 లో సువర్చల పుట్టింది ..."

"...ఏ 65 లోనో రాంబాబు పుట్టుంటాడు."

"అరే – కనిపెట్టేశారే! అందుకే టీచరయ్యారు." అని ప్రసాద్ అంటూండగా రిక్షాలో వస్తూన్న ఓ ఆఫీసరు "ఏం, ప్రసాదూ! ఫామిలీతో షికారుకి బయలుదేరావా?" అని పలకరించాడు. ఇరుకున పడ్డ ప్రసాద్ "అదా ... అది కాదు, సార్! ... అంటే ... అవును...కారు లేదు కదా? షికారుకి బయల్దేరాను," అన్నాడు కంగారుగా. "ఓ–కే ... కేరియాన్!" అంటూ రిక్షాలో ఆఫీసర్ వెళ్ళిపోగానే ప్రసాద్ 'హమ్మయ్య' అనుకొని సరస్వతి వంక జాలిగా చూస్తూ,



"ఆయన మా ఆఫీసరండి. పుసుక్కున 'ఫామిలీ' అనేశాడు. కాదన్నాననుకోండి. పరాయి ఆడపిల్లను వెంటేసుకొని తిరుగుతున్నానని కోప్పడి, కథాకళి డాన్సు అదీ చేసేస్తాడు. అసలే ఛండశాసనుడు... నేనలా అన్నానని మీకు కోపమొచ్చిందా?" అంటూ ఓరకంట చూశాడు.

"అబ్బే! కోపమెందుకండీ?"

"రాలేదు కదా? అందుకే టీచరయ్యారు."

"సైకిలుండి శ్రమపడి నడుస్తున్నారు – పాపం!" అంది సరస్వతి వచ్చేనవ్వును ఆపుకుంటూ.

"శ్రమా? నో–నో... శ్రమేమిటండీ?" అంటూ ప్రసాద్, సైకిల్‌వంక చూసుకుంటూ,

'జగమొండి'లో ప్రభాకరరెడ్డి



"మీరు అలాంటివేం పెట్టుకోకండి. ఎప్పుడూ సైకిల్ తొక్కడం మంచిదికాదని 1953లో డాక్టర్ చెప్పడంతో, ఎక్సర్‌సైజ్ కోసం నడుస్తున్నాననుకోండి... ఈ సైకిల్ వయసు ఎంతో తెలుసాండీ?" అంటూ పక్కకు తిరిగాడు... సరస్వతి లేదు! తుళ్ళిపడ్డాడు ప్రసాద్.

రవి కళామందిర్‌వారి 'సిరిమల్లె నవ్వింది" చిత్రాన్ని విజయనిర్మల దర్శకత్వంలో ఎం. ఎస్. ప్రసాద్, ఆదుర్తి భాస్కర్ నిర్మించారు.

## ఇంద్రుడు - చంద్రుడు

"జూలైలో హైదరాబాద్‌లో షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు టి. కృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, కూర్పు, దర్శకత్వంలో డి. రవీందర్ నిర్మాతగా అక్కు సుశీలాబాయి సమర్పించే శ్రీ లక్ష్మి ఆర్ట్ క్రియేషన్స్ "ఇంద్రుడు – చంద్రుడు"లో శ్రీధర్, శరత్‌బాబు, నూతన్ ప్రసాద్, నాగేష్, పొట్టిప్రసాద్, సత్తిబాబు, శ్రీధరాచారి, మంజుభార్గవి, జ్యోతి, పుష్పలత, మనోరమ, రాజ్యలక్ష్మి, రమోల, సత్యవాణి, జ్యోతిలక్ష్మి, జయమాలిని నటిస్తారట. దేవసాని కథకు డి. ప్రభాకర్ మాటలు రాస్తారు. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు.

## అపూర్వ రాగం

దాసరి నారాయణరావు మాటలు, చిత్రానువాదం, పర్యవేక్షణలో ఆయన అసోసియేట్ రేలంగి నరసింహారావు దర్శకత్వం నెరిపే చిత్రాన్ని చిత్రబాల మూవీస్ పతాకంలో పాండ్యన్, వేణు నిర్మిస్తారు. "ఒరుతలై రాగం" అనే విజయవంతమైన తమిళ చిత్రం దీనికి ఆధారం. ఆగస్టు నుంచి షూటింగ్ ప్రారంభమవుతుంది. చక్రవర్తి సంగీత దర్శకుడు.

## కనక మాలక్ష్మి

శ్రీ కృష్ణకళామందిర్ వారి పై చిత్రానికి జూన్ 26 ఉదయం తొలిగీతం ధ్వనిముద్రిత చేయబడింది. వి. కృష్ణయ్య సమర్పణలో టి. ఎస్. ప్రసాద్ నిర్మాత చంద్రమోహన్, సత్యనారాయణ, ఈశ్వరరావు, వంకాయల, సాయిప్రసాద్, దీప, జ్యోతి, నిర్మల వగైరా తారాగణం. గొల్లపూడి, ఆరుద్ర, ఇళయరాజా, యోగానంద్, రంగారావు, విజయ్, మురళీకృష్ణ సాంకేతిక సహకారంతో మదన్‌మోహన్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## కొత్త నీరు

చంద్రమోహన్, దీపతో దర్శక నిర్మాత కె. ఎస్. ప్రకాశరావు త్వరలో ప్రారంభించే చిత్ర సాహితివారి "కొత్తనీరు" చిత్రానికి ఆరుద్ర మాటలు, పాటలు రాస్తున్నారు. చక్రవర్తి సంగీత దర్శకుడు. నవకాంత్ ఛాయాగ్రాహకుడు.

## నవ్వుతూ బ్రతకాలిలో నమ్మలేని నిజాలు

శ్రీపతి ఆవేశంతో ఊగిపోతూ, "నిప్పులాంటి నిజాన్ని గుండెల్లో దాచుకుని, నిన్ను కన్నబిడ్డ కన్నా మిన్నగా చూసినందుకు — నువ్వు ఈ ఇంటి వాసాలు లెక్కపెట్టే స్థితికి వచ్చావా ?" అన్నాడు.

గీత నిర్ఘాంతపోయింది. "నేను ... నేను మీ బిడ్డను కానా ?"

"చెప్పకూడదనే అనుకున్నాను. కాని, నువ్వు చెప్పే స్థితికి తీసుకొచ్చావ్. ఈ ఇంటి అల్లుడు కాబోయే ప్రకాష్‌ని వల్లో వేసుకుని, నా పవిత్ర ఆశయానికే కళంకం తీసుకొచ్చావ్ ?"

"ఏమిటీ అన్యాయం ? నేను మీ బిడ్డను కానప్పుడు నన్నెందుకు అందలం ఎక్కించారు ? ఎందుకు అనుబంధం పెంచారు ? ఇప్పటికైనా చెప్పండి. నేనెవర్ని ? నా తల్లిదండ్రులు ఎక్కడున్నారు ?"

"ఎవరూ లేరు. ఉన్నా — లేనివారయ్యారు. నువ్వు 'అమ్మా, అమ్మా' అని ఏడుస్తూంటే, నేను ఆదరించాను. పనిపిల్లలా వెట్టిచాకిరి చేయించుకోవడం ఇష్టంలేక — నా బిడ్డతో సమానంగా చూసుకున్నాను. నీకో స్థానం కల్పించాను. కాని, నువ్వు మాత్రం సంకుచితంగా ప్రవర్తించావు. నా ప్రాణ స్నేహితుడికిచ్చిన మాట నిలబెట్టుకోడానికి ప్రకాష్‌ని అల్లుడుగా చేసుకోబోతుంటే—"

"—అడ్డుపడ్డాను. అంతేగా మీరనేది ? మీ చేతుల్లో పెరిగిన నేను అంత స్వార్థపరురాలను కాను. నేను మీకు బిడ్డను కాకపోయినా — రాధ నాకు చెల్లెలు. నా కంఠంలో ప్రాణముండగా నా చెల్లెలికి అన్యాయం జరగదు; జరగనివ్వను. ఇంత కాలం నన్ను ప్రాణంగా చూసుకున్నందుకు మీకు జీవితాంతం కృతజ్ఞురాల్నిగా ఉంటాను. నేను చేసిన పొరబాటుకు క్షమించండి," అని గీత (కాంచన) అంటూంటే, శ్రీపతి (రావి కొండలరావు) అవాక్కయిపోయాడు.

"జూలై 19న విడుదల," అన్నారు నరేంద్ర ప్రొడక్షన్స్ "నవ్వుతూ బ్రతకాలి" చిత్రాన్ని సమర్పించే నల్లంరెడ్డి ప్రసాద్. చంద్రమోహన్, రంగనాథ్, శరత్‌బాబు, గుమ్మడి, సత్యప్రియ, రమాప్రభ, అంజలీదేవి, కె.వి. చలం, ధూళిపాళ, అనిత పాల్గొన్నారు. ఎన్. లక్ష్మీదేవి కథకు పినిశెట్టి మాటలు రాశారు. జి. కె. వెంకటేశ్ సంగీత దర్శకుడు. మల్లి ఇరానీ ఛాయాగ్రాహకుడు. పి. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. శ్రీనివాసరావు, కె. బి. సూర్యనారాయణ నిర్మాతలు.



'నన్ను క్షమించు రాజా'లో సుమలత, కమలహాసన్

## దూరపు కొండలు

నరేంద్ర ప్రొడక్షన్స్ "నవ్వుతూ బ్రతకాలి" చిత్రం జూలై 19న విడుదలయ్యాక నల్లంరెడ్డి ప్రసాద్ సమర్పించే మరో చిత్రం రాధికా ఆర్ట్ పిక్చర్స్ "దూరపు కొండలు" చిత్రం షూటింగ్ ప్రారంభమవుతుంది. ఇందులో శరత్‌బాబు, రూప, శ్రీధర్, కాంచన, ప్రసాద్‌బాబు, రాధ, లక్ష్మీకాంత్, రమాప్రభ, కె. వి. చలం, ధూళిపాళ, రావి కొండలరావు, పి. ఆర్. వరలక్ష్మి, ఆదోని లక్ష్మి పాల్గొంటారు. ఎన్. ఎల్. దేవి కథకు గొల్లపూడి, ప్రత్యేక హాస్య సంభాషణలు అప్పలాచార్య రాస్తున్నారు. జి. కె. వెంకటేశ్ సంగీతం, ఎం. ఎ. ఇరానీ కెమెరా, వీరప్ప కూర్పు, సోమనాథ్ శిల్పంతో పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## విజయలలిత సమర్పణలో మరో చిత్రం

కె. వాసు దర్శకత్వంలో "దేవుడు మామయ్య చిత్రాన్ని సమర్పించే విజయలలిత కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో మరో చిత్రాన్ని సమర్పించబోతోంది. ఈ కొత్త చిత్రం షూటింగ్ జూన్ 19న విశాఖపట్నంలో మొదలైంది. "విశాఖపట్నం ప్రాంతాల్లో ముప్పై రోజుల్లో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ పూర్తవుతుంది — అంటే, జూలై 20 వరకు," అన్నారు డైరెక్టర్ దాస్. మురళీమోహన్, రామకృష్ణ, విజయశాంతి, విజయలలిత, ప్రభాకరరెడ్డి, కాంతారావు, కె. వి. చలం, త్యాగరాజు, మిక్కిలినేని, కొంగర జగ్గారావు, పండరీబాయి, మమత పాత్రధారులు. దాస్ కథ, స్క్రీన్‌ప్లేకు సత్యానంద్ సంభాషణలు రాశారు. ఆరుద్ర, గోపి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, మోహన్ కూర్పు, రంగారావు సహకార దర్శకత్వంతో డి. వెంకట్రామయ్య, త్రివాణ్, కె. రామమోహనరావు నిర్మాతలు.



'నవ్వుతూ బ్రతకాలి'లో చంద్రమోహన్, సత్యప్రియ


'ఆపద్బాంధవులు'లో చక్రపాణి, గీత

## పిల్ల జమీందార్ లో బయటపడ్డ బండారం

బాలరాజు (ఎ. ఎన్. ఆర్.) స్విమ్మింగ్‌పూల్ వద్ద దూకటానికి సిద్ధంగా ఉన్నాడు. కనకం (రమాప్రభ), శాంత (రాధాకుమారి), గోపాలం (పి. ఎల్. నారాయణ), మేనేజర్ (ధూళిపాళ) గుడ్లప్పగించి చూస్తున్నారు.

"అహహహా ! రెడీ ఫర్ డైవింగ్! ఎవరైనా డైవ్ చేస్తారా ? పోనీ జంప్ ! ఓ. కే !" అంటూ బాలరాజు దూకాడు. అందరూ ఆటే చూస్తున్నారు. బాలరాజు కనిపించకపోయేసరికి —

"బాబాయి మునిగిపోయినట్టున్నాడు. ప్లీడరుకు కబురు పంపాలేమో, పాపం !" అంది కనకం.

"బాగా అన్నావే, కనకం ! ఇంకా తేలేలా కనబడ్డం లేదు, పాపం !" అన్నాడు గోపాలం.

"శివ శివా ! అన్నయ్య శవం తేల్తుందో — ఏమిటో పాపం !" అని నిట్టూర్చింది శాంత.

"చివరి చూపు కూడా దక్కేలాలేదు పాపం," మూల్గాడు మేనేజర్.

అంతలోనే వాళ్ళందరూ తెల్లబోయారు. బాలరాజు హఠాత్తుగా కనిపించి, "హేయ్ ! అంత తేలిగ్గా పోతాననుకున్నార్రా ? కసరత్తులు చేసిన బాడీ ఇది ! ఈ సంవత్సరం షష్టిపూర్తి చేసుకున్న వాళ్ళ రన్నింగ్ రేస్‌లో ఫస్టొచ్చాను. ఏమనుకున్నారో ... హహహా ! ఏమే, కనకం ? నేను వినలేదనుకున్నావా ? ప్లీడరుకు కబురు పెడ్తావా ?" అన్నాడు.

కనకం తడబడుతూ, "అబ్బే — అబ్బే ! ఉత్తినే అన్నాను, బాబాయ్ — నవ్వులాటకి. ఇప్పుడు మనకు ప్లీడరెందుకూ ?" అంది.

"ప్లీడరుకు కాదే; బ్రోకరుకు కబురుపెట్టు. ఒక అద్దెఇల్లు చూసుకొని, మకాం మార్చడానికి... ఏమయ్యా, మేనేజరూ ! నా దగ్గర నాలుక్కాలాల పాటు చేయాలని లేదా నీకు ? ఆఖరి చూపు దక్క లేదంటావా ?"

"అబ్బెబ్బే ! అది ... నా గురించి నే ననుకున్నా, సార్ ! మొన్న గ్రహణం రోజున సూర్యుడ్ని చూశాను. ఈ కళ్ళజబ్బొచ్చి — చూపు సరిగా ఆనడం లేదని అన్నాను," అన్నాడు మేనేజర్ వొణుకుతూ.

"ఇంకా నయం — పూర్తిగా కళ్ళు పోయాయి కావు. ఇదిగో ఒక్కొక్కరూ జ్ఞాపకం చేసుకోండి. మీరేమైనా పిచ్చి పిచ్చి వేషాలు వేశారో— ఫుట్‌బాల్ ఆడేస్తాను. ఆఁ !" అని బాలరాజు అనడం దూరం నుంచి పొంచి విన్న మధు (ఎ. ఎన్. ఆర్.) విని, "తాతగారూ !" అంటూ బరువుగా నిశ్వాస వదిలాడు.


'పసుపు—పారాణి'లో ఒక దృశ్యం

శ్రీమతి అన్నపూర్ణ నాగేశ్వరరావు సమర్పించే అన్నపూర్ణ స్టూడియోస్ "పిల్ల జమీందార్" చిత్రాన్ని సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో


'కేటుగాడు'లో మోహన్‌బాబు

వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని నిర్మిస్తున్నారు.

## వంశీకృష్ణా మూవీస్

సుప్రసిద్ధ కన్నడ నవల "వంశ వృక్ష" ఆధారంగా బాపు దర్శకత్వంలో జూన్ 26 నుంచి ఆగస్ట్ 1 వరకు రాజమండ్రి పరిసర ప్రాంతాలలో షూటింగ్ జరిగే చిత్రంలో జె.వి. సోమయాజులు. అనిల్‌కుమార్, ముక్కామల, రాళ్ళపల్లి ఇంత తారలకు ఎన్నికయ్యారు. ముళ్ళపూడి సంభాషణల కర్త. మహదేవన్, అహ్మద్ అజ్మి, భాస్కరరాజు, కె.వి. రావు, రవి ప్రభృత సాంకేతికవర్గం.

## టాక్సీ డ్రయివర్

కట్టా సుబ్బారావు డైరెక్టు చేసే మరో చిత్రం విశ్వచిత్ర సినీ ఎంటర్‌ప్రైసెస్ "టాక్సీ డ్రయివర్." కృష్ణంరాజు, గాయత్రి, రాజ్యలక్ష్మి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, మోహన్ బాబు, సారథి, కె. వి. చలం, జానకి తారాగణం. కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త. సత్యం సంగీతంలో వేటూరి గీతాలు రాస్తారు. రాజారావ్ ఛాయా గ్రాహకుడు. జి. రామకృష్ణంరాజు నిర్మాత.



దేవర్ ఫిలింస్

# మాయదారి కృష్ణుడు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: ఆర్. త్యాగరాజన్ B.Sc.,
నిర్మాత: సి. దండాయుధపాణి B.Com.,
సంగీతం: ఇళయరాజా
మాటలు - పాటలు: ఆత్రేయ

వరల్డ్ నెగిటివ్ రైట్స్ కంట్రోల్డ్ బై:
**రావుల అంకయ్యగౌడ్**
రవీంద్రా ఫిలింస్, గూడూరు.

లక్ష్మీ ఫిలింస్

LAKSHMI PUBS



'సీతారాములు'లో ఒక సన్నివేశం

## సినిమా

### రగిలే హృదయాలులో ఎగిరిపడే సీతాలు !

తాగి నానా అల్లరి చేస్తున్న గుర్నాధం (మాడా) కి నాలుగు తగిలించింది సీతాలు (జయప్రద). ఉక్రోషంతో అతను అసలు విషయాన్ని కప్పిపుచ్చి, తనపై ఓ ఆడ రౌడీ అన్యాయంగా చెయ్యి చేసుకుందని మొరపెట్టుకున్నాడు రాము (కృష్ణ)తో. అది నమ్మి, సాయంత్రం ఆయిదు గంటలప్పుడు వచ్చి ఆ అమ్మాయి తడాఖా చూస్తానన్నాడు రాము — సానుభూతితో. కాని, ఈలోగానే పైప్ దగ్గర మళ్ళీ ఆమెతో అనవసరంగా గొడవపడ్డాడు గుర్నాధం. దాంతో అతని ఒళ్ళు హూనం చేస్తానంటూ ఎగిరెగిరి పడసాగింది సీతాలు. ఆ సమయానికి అటు వచ్చిన రాము "శభాష్ పిల్లా! డాన్సు బాగా ఆడుతున్నావ్! ఇదే డాన్సు? భరతనాట్యమా, కూచిపూడా?" అన్నాడు పరిహాసంగా.

"గురూ, గురూ! నన్ను కొట్టింది ఈ ఆడరౌడీయే, గురూ!" అంటూ మళ్ళీ ఫిర్యాదు చేశాడు గుర్నాధం.

"అంటే, నువ్వొక మనిషిని తోడు తెచ్చుకున్నావన్నమాట? ఇదుగో... ఈ సీతాలుకు ఒళ్ళు మండిందో — సీరేస్తది జాగర్త!" అంది సీతాలు.

"చీరేస్తావా? చీర ఆరేస్తావా?" అన్నాడు రాము జబ్బలు చరుచుకుంటూ.

"ఏయ్! ఎవడివయ్యా నువ్వు? రౌడీవా? రా, రౌడీ! ఇవ్వాళ నువ్వో నేనో తేలిపోవాలి."

"ఏమిటి? ఎందుకలా కప్పలా గెంతుతావ్? నేలమీద నిలబడి మాట్లాడు."

"కబుర్లు చెప్పకయ్యా! ఈ సీతాలుకు ఒళ్ళు మండితే సీరేస్తది జాగర్త! దమ్ముంటే...రా!"



నటరత్న యన్.టి.రామారావు
నటించు

లక్ష్మీవిష్ణు ప్రొడక్షన్స్





# సూపర్‌మేన్

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: వి.మధుసూదనరావు

నిర్మాత: ఆర్.గోపాల్

ANNAPURNA

అన్నపూర్ణ ఫిలింస్

''ఇదుగో! నాకు తిక్కరేగిందంటే, నీ పంబ రేగుతుంది జాగ్రత్త!''

''ఇదుగో! నాతో గొడవ పెట్టుకోకు. దెబ్బ తింటావ్!''

''దెబ్బతింటానో–తినిపిస్తానో చూద్దామా?'' అంటూ రాము, ఆమె భుజంమీద నొక్కాడు. అంతే. బాధతో కొయ్యబారిపోయినట్లు కూర్చుండి పోయింది సీతాలు.

ఆ అల్లరిపిల్లను ఓ ఆట పట్టించినందుకు రాము విర్రవీగలేదుగాని, ఆమె అవస్థకు విరగబడి నవ్వాడు.

''ఇది నాయికా నాయకుల తొలి సమాగమం,'' అన్నారు నవచిత్రా ఇంటర్నేషనల్‌వారి ''రగిలే హృదయాలు'' చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన ఎం. మల్లికార్జునరావు. జంధ్యాల సంభాషణలు, సత్యం సంగీతంతో సనత్‌కుమార్, నారాయణబాబు నిర్మాతలు.

**ఆ శా జ్యో తి**

''జూలై 7న సాంగ్స్ రికార్డింగ్, జూలై 26న షూటింగ్ ప్రారంభిస్తున్నాం,'' అన్నారు దర్శక నిర్మాత తాతినేని ప్రకాశరావు. అనిల్ ప్రొడక్షన్స్ ''ఆశాజ్యోతి''లో సుజాత, మురళీ మోహన్, శ్రీధర్, శరత్‌బాబు, జగ్గయ్య, రావు గోపాలరావు, పి. ఎల్. నారాయణ, నిర్మల, పుష్పలత ముఖ్య తారాగణం. జంధ్యాల, రమేష్ నాయుడు, సి. నారాయణరెడ్డి, ఆత్రేయ, ఎ. విన్సెంట్, తోట ప్రభృత సాంకేతికబలంతో అక్టోబర్ 12కి షూటింగ్ పూర్తవుతుంది.

—జి.వి.జి. ★







**మీరు యింకా యే యితర ఖర్చులకు ఆలోచిస్తున్నారు**

# మీకు అందించిన దానికొరకు కెనరా బ్యాంకను సహాయము చేయనీయండి

భవిష్యత్తులో మీరు తలపెట్టిన పెద్ద ఖర్చులనైనా సగము ఖర్చు కెనరా బ్యాంకు భరిస్తుంది. మీరు ముందుగా ఆలోచించి పొదుపు చేసిన ప్రతిదీ మీకు అందుబాటులోనే వుంటుది. మీకు రాబోయే యే విధమయిన ఖర్చులకుగాను సహాయముచేయుటకే కెనరా బ్యాంక్ ప్రత్యేకమయిన ప్రణాళికలను కలిగియుంది.

ఎన్నాళ్ళనుంచో కోరుకొంటున్న మోటారుకారా! స్కూటరా! స్వంతయిల్లా! మీ బిడ్డకి వున్నత విద్యయా! లేక పెళ్ళా! కామధేను పొదుపు ప్రణాళికలో మీ డబ్బును కాలపరిమితిలో ఎక్కువ వృద్ధిపొందును.

ఈ ప్రణాళికలోని గొప్ప విశేషమేమనగా మీకు కావలసిన మొత్తములో కొద్దిభాగమును పొదుపు పరచుటయే. పొదుపుపరచు మొత్తమును, నెలల సంఖ్యను మీరే నిర్ణయించుకొనండి. దానిమీదనుండి వడ్డీమీద వడ్డీయే మీకు నెలనెలా మంచి రాబడి, మరియు మీ డబ్బు రెండింతలకు పైగా వృద్ధిపొందుతుంది.

మీ దగ్గిరలో నుండు కెనరా బ్యాంక్ శాఖకువెళ్ళి వివరములు తెలుసుకొనండి

మా యితర ప్రత్యేక ప్రణాళికలు: విద్యానిధి నిరంతర బాలక్షేమ.

## కామధేను పొదుపు

## కెనరా బ్యాంక్




కెనరా బ్యాంక్ (జాతీయ బ్యాంక్)
దేశము మొత్తమున 1200కు పైగా శాఖలు కలవు.

maa CB 5 Tel B 80

## ఎంత ప్రార్థన!

మద్రాసు మైలాపూరు కపాలీశ్వరుని ఆలయం ముందున్న కోనేటిలో ఓ స్త్రీ శరీరం తేలుతుండటం చూసిన జనం నలుగురు పోగై నానా కష్టాలు పడి బయటకు తీసి, హమ్మయ్య! ఎంత గొప్ప పని చేశామనుకునే సరికి కావిడ కళ్ళు తెరిచి, "ఓరి పాపిష్టులారా! నా ప్రార్థనను నాశనం చేశారు గదా" అని చీవాట్లు వేసిందట. దాంతో వాళ్ళు హడలి, కొయ్యబారి పోయారట. అదేం రకం ప్రార్థన దేవుడా!

**అతని కడుపు!**

[illegible]లూరుకు చెందిన ఎస్. ఎస్. ఆర్. జిల్లా ప్రభుత్వ ఆసుపత్రిలో ఓ 22 ఏళ్ళ అబ్బాయిని కడుపునొప్పితో బాధపడి చేరితే అతన్ని పరీక్షించి ఎగిరి గంతేశారట. అతను కడుపుతో వున్నాడట. ఇన్నేళ్ళుగా అతని తల్లి కూడా అతన్ని మగపిల్లాడనే అనుకుని పెంచిందట. గానీ అతను మగ పిల్లాడు కాదట. ఉభయ గ్రంధులూ అతనిలో సమృద్ధిగా వున్నాయట. అతనికి వచ్చిన ఈ గర్భానికి డాక్టర్లు హెమాఫస్ ట్రాఫిక్ క్లిటోరిస్ అని పేరు పెట్టారట. ఇతన్ని సాంతం మగ వాణ్ణి చేయడమా, లేక సాంతమాడదానిగా మార్చేయడమా అని డాక్టర్లాలోచిస్తున్నారట.

**ప్రచారం!**

పోయిన ఎన్నికలలో కోయంబత్తూరులో అరుణాన్ అనే ఆయన తన 'గుర్తు' ఏనుగ వచ్చిన సందువల్ల ఓ నిజం ఏనుగు మీద ఎక్కి ఎన్నికలలో తనకే ఓటు వెయ్యమని అడుగుతూ వూరు వూరంతా తిరిగారట. పార్థసారధి అనే ఆయనకు సింహం గుర్తు లభించినందువల్ల తానూ అంత పని చేయలేక ఓ గోనె బస్తాను చొక్కాగా



తొడుక్కుని నడుచుకుంటూ ప్రచారం చేసుకున్నారట. ఈ రాజకీయ నాయకులెవరేం చేస్తారో, ఎందుకలా చేస్తారో కనిపెట్టలేం సుమండీ.

**ఆస్పత్రుల్లో పిల్లలు అదృశ్యం!**

మద్రాసు ఎగ్మూరులోని ప్రసూతి ఆసుపత్రి [అనెక్స్]లో 27 ఏళ్ళ తెల్లయేనాయక్ అనే ఆమెకు పుట్టిన పసి బిడ్డను ఎవరో ఎత్తుకుపోయారట. ఇదేమాదిరిగా ట్రిప్లికేనులోని కస్తూరిభాయి ఆసుపత్రిలో ఇరంజెలియమ్ అనే 28 ఏళ్ళ ఆమెకు పుట్టిన పసి బిడ్డను కూడా ఎవరో ఎత్తుకు పోయారట. ఈ రెండు సంఘటనల వల్లా మద్రాసులోని గర్భిణి స్త్రీలంతా హడలిపోతున్నారట. ఈ పిల్లలనెత్తుకుపోవడం ఎవరో చక్కని ప్లాను ప్రకారం చేస్తూ ఉన్నారని, వీరిని పట్టుకోడానికి పోలీసు బస్టాండు, రైల్వేస్టేషను, విమాన నిలయాలలో నిఘా వేసిందట.

**సంతకం తెచ్చిన తంటా!**

మద్రాసు కోర్టులో ఒక లారీ డ్రయివరుమీద కేసుపెట్టిన ఆసామీ తన లాయరుకు తెల్ల కాగితం మీద తన సంతకం పెట్టి యిచ్చాడట. ఈ కేసు విచారణలో ఆ ఆసామికి కోర్టు ఇప్పించిన 65వేల రూపాయలూ ఆ లాయరుగారు ఎంచక్కా అంది పుచ్చుకున్నారట. ఈ డబ్బు తనకు చేరలేదనీ, తనను లాయరుగారు మోసగించారనీ ఆ ఆసామి తిరిగి కోర్టులో ఫిర్యాదు చేశాడట.

**అపస్మారకంలో సావిత్రి!**

మే నెలలో ఓ సినిమా షూటింగ్‌లో పాల్గొనడానికి మద్రాసునుంచి బెంగుళూరు వెళ్ళి నిద్రమాత్రలు మింగి, ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో పదహారు రోజులుగా అక్కడే చికిత్స పొంది, ప్రయోజనమంతగా లేని స్థితిలో ఉన్న నటి సావిత్రిని నటుడు, భర్త అయిన జెమినీ గణేశన్ మద్రాసు తీసుకువచ్చి ప్రయివేటు ఆసుపత్రిలో చేర్చారట. మే 27 నుంచి నేటి వరకూ యింకా చికిత్సలోనే ఉన్న సావిత్రి ఒక్కసారి జెమినీగణేశన్‌తో మాట్లాడారటంతే. మళ్ళీ అపస్మారక స్థితిలోకి దిగజారిపోయారట.

**సముద్రంమీదే అన్నీ!**

భూగర్భంలో నూనె తీసే యంత్రాంగం నార్వేకి చెందిన సముద్రం మీద ఉన్నదట. ఇది ప్రపంచంలోకల్లా పెద్దదట. సముద్రం మీద కట్టిన యీ యంత్రాంగంలో పని చేసే వారందరూ అక్కడే ఉండడానికి నూరు వసతి గదులూ, క్యాంటీనూ, చిన్న ఆసుపత్రి, కొట్లూ అన్నీ కూడా ఉన్నాయట. ఈ మాదిరిది ప్రపంచంలోనే లేదట.

**హత్యకి దారితీసిన ఆలుమగల తగాదా!**

వోదికుప్పమ్ అనే గ్రామానికి చెందిన 25 ఏళ్ళ చిన్న తంబి అనే అతనికి, అతని భార్య 18 ఏళ్ళ అమ్మతానికి ఒక్కక్షణం పడేదికాదట. పెళ్ళయి అయిదు నెలలు అయినా అస్తమానం దెబ్బలాడుకునేవారట. మొన్న 20వ [జూన్] తేదీన కూర సరిగా ఉడకలేదని చిన్నతంబి ఆమెను నానా తిట్లూ తిడితే, ఆమెకూడా ఎదిరించిందట. దాంతో ఒళ్ళు మండిన చిన్నతంబి పప్పుడి బండపెట్టి ఆమె నెత్తిన ఒకే ఒక దెబ్బ కొట్టాడట. ఆ దెబ్బకామె తలపగిలి, రక్తపు మడుగులో విలవిలా తన్నుకుని చనిపోయిందట.

---

## అతను నడచినదోవ

(14వ పేజీ తరువాయి)

మూర్తి కళ్ళు అప్పగించి ఉద్యోగుల వైపు ద్వారాన్ని చూస్తూ ఆలోచనలో పడ్డాడు. ఆ అంధుడు దిగిపోతూ — ఆ ద్వారానికి ఆపాదించిన ప్రత్యేకత, రైల్వే వారు ఆపాదించి, పోస్టల్ వారు కాపాడుకుంటున్న ప్రత్యేకతకన్నా ఎంతో బలీయంగా కనిపిస్తోంది.

అదనంగా వచ్చే చిల్లర గురించిన ఆలోచనే లేనట్లు — మిగిలిన పెట్టెల్లో ఒకరి కాలు తాను తొక్కకుండా, ఒకళ్ళ చేత తాను తొక్కించుకోకుండా — అతను చాలా మామూలుగా ఆ ద్వారంలో నుంచి దిగివెళ్ళిపోయాడు. అతని పాట, అతనికి వచ్చిన చిల్లర! పాట పాడిన ఆ మనిషికీ, విన్న శ్రోతలకీ (చిల్లర ఇచ్చినా, ఇవ్వకపోయినా) — అందరికీ దక్కినది హాయికాదూ? కర్తతో పాటు పది మంది శ్రేయస్సుని వర్షించే నేపథ్యాలు అతని పాట నుంచి ఉద్భవించ లేదూ? అతను చేసింది యజ్ఞం కాదూ.

అతని ఆదాయానికి తన ఆదాయం కొన్ని రెట్లు ఉంది. అయినా — లెజిగేటరీ వృద్ధి కావలసినంత కాదు అన్న ఆలోచన, తనకి దక్కబోతున్న అదనపు ప్రయోజనాల ఆకర్షణ కింద అణిగి పోతోందేం? వ్యక్తిత్వం పూర్తిగా వికసించిన తన నల్గురు, మరొక వ్యక్తికి భాగస్వామి అవటం — ఆ జంటతో పాటు అభివృద్ధి చెందవలసిన దేశానికి ఎంతో మేలు అన్న ఆలోచన, "లక్ష్మి సుఖపడటం, తను బెంగ పడటం" అనే భావం కింద అణిగిపోతోందేం?

ప్రయోజనం అనిపించిన సుడిగుండంలోకి హడావుడిగా దూకేసి, అంతకు మించిన శ్రేయస్సుని చూడలేని గుడ్డితనానికి గురి కాబోతున్నాడు తను. సుడిగుండానికి తన నుంచి దూరంగా నిలబెట్టి, అందరికీ హాయిని ఇచ్చిన వెలుగు అతను. తన దృష్టిని అలుముకుంటున్న గుడ్డితనానికి గురువుగారి యజ్ఞం మందు.

"యజ్ఞానికి వెళ్ళేటట్టయితే అతను దిగిన వైపు దిగుదాం. లక్ష్మి పెళ్ళే ముఖ్యమనుకుంటే నలుగుర్ని తొక్కేయటానికో, నలుగురితో తొక్కించేసు కోవటానికో సిద్ధపడి అందరూ దిగే దోవలో దిగుదాం" — అన్నాడు మూర్తి.

**పసిబిడ్డకు ఉసురు పెట్టిన పలాయనం!**

కరూరుకు చెందిన పంచమదేవి గ్రామంలో సి.పి.ఐ. వ్యక్తులూ, డి.యం.కె వ్యక్తులూ మాటా మాటా అనుకున్నారట. డి. ఎం. కె. వ్యక్తి వో సి.పి.ఐ. వ్యక్తి మీద చెయ్యి చేసుకున్నాడట. దాంతో యిద్దరు సి.పి.ఐ. వ్యక్తులు ఆ డి. ఎం. కె. సుబ్రహ్మణ్యం మీద తిరుగబడె సరికాతను పలాయనం చిత్తగించి ప్రాణసంరక్షణార్థం పరుగున వో గుడిసెలోకి దూరాడట. ఆ గుడిశలో అనారోగ్యంతో మంచం మీద పడుకుని వున్న రెండేళ్ళ పసిపిల్లాతన్నీ, అతను వచ్చిన తీరును, అతని వాలకాన్నీ చూసి భయపడి కెవ్వున కేకవేసి కొయ్యబారి ఆసుపత్రికి తీసుకు వెళ్ళి వైద్యం చేయించే లోగా చనిపోయిందట.

సీరియల్

# జీవితగమ్యం

శ్రీమతి యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

కోపంగా కోమల్ని చూసాడు. అంతకన్నా కోపంతో, అవమానంతో, రోషంతో కోమలి సత్యాన్ని చూసింది.

"బుద్ధి లేదూ— ఏమా చొరవ ?"

"తప్పేం— నేను నీకు బావను, నువ్వు ఒప్పుకుంటే నీకు కాబోయే భర్తను."

"ఏమిటి? నువ్వు నాకు భర్తవా! ఇంత సంస్కారం లేనివాడివి భర్తవు కాగలవా? నీకు మతి పోలేదుకదా! బంధువని చనువుగ ఉంటే ఇలా అసహ్యంగా ప్రవర్తిస్తావా? జాగ్రత్త! ఇకముందు నా ఒంటిమీద చెయ్యి వేసావంటే నేను ఊరుకునేది లేదు."

"ఏమే కోమలి ! మితిమీరి పోతున్నావు. నీ బ్రతుక్కి నేను కాకపోతే మరెవ్వడే నిన్ను పెండ్లి చేసుకుంటాడు ? నే చూస్తాగా నిన్నెవడు పెళ్ళి చేసుకుంటాడో! నన్ను కొట్టి అవమానిస్తావా ! అనుభవిస్తావులే ! చూడు పుగని" అని రోషంతో పెట్టెలో తన బట్టలు సర్దుకుని, తన పెట్టెను, సంచీని తీసుకుని హాలులోకి వచ్చాడు.

ఆసరికి విమలమ్మ వీధిలో నుంచి వచ్చి సత్యాన్ని చూసింది.

"ఏమిరా సత్యం! ఎక్కడికి ప్రయాణం?"

"మా ఇంటికే అత్తయ్యా ! ఈ ఊరిలో పని పోయింది, వెళ్ళిపోతున్నా"

"పోనీ ఈ రాత్రి భోజనం చేసి రేపొద్దున్న వెళ్ళరాదూ ?"

"లేదత్తయ్యా— రేపొద్దున్న షెడ్యూలో పనుంది. ఓ అరగంటలో బస్సుంది. వెళ్తా"

గిరుక్కున తిరిగి సత్యం వెళ్ళిపోయాడు. విమలమ్మ కాస్త ఆశ్చర్యపోతూ సత్యం వెళ్ళిన్నవైపే చూస్తుండి పోయింది. కోమలి గదిలో శిలా ప్రతిమలా ఉండి పోయింది. హఠాత్తుగా జరిగిన ఈ విపరీత సంఘటనకు నిర్ఘాంతపోయింది. మనసేదో కీడును శంకించింది.

రాఘవరావు విశాఖపట్నం చేరిం తరు

(గత సంచిక తరువాయి)

వాళ్ళ మందుల వ్యాపారం బాగా సాగుతోంది. రాఘవరావు తనలాంటి కొందరు వంకర మనుష్యులతో చేతులు కలిపి విదేశ పడవల నుంచి బ్రాంది, విస్కీ స్మగుల్ చేసి తన మందులకొట్టు ద్వారా ఖరానా మనుష్యులకు సరఫరా చేసి బాగా డబ్బు గడిస్తున్నాడు. పెద్దమనిషిగా, కళా పోషకుడుగా పేరు తెచ్చుకున్నాడు. పెద్ద కొడుకు కలకత్తాలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. రెండో కొడుక్కు చదువు బాగా అబ్బడం లేదు. ఎలాగో పి. యు. సి. లో చేరాడు.

ఇంజనీరు శేఖర్‌కి పెద్ద పెద్ద సంబంధాలు వస్తున్నాయి. బేరాలు సరిగా కుదరక ఇంకా ఏమీ ఖాయపర్చలేదు రాఘవరావు. అతడి వేటంతా మంచి ఆస్తిపరుడికి ఒక్కరే కూతురుండాలి. చదువెలా ఉన్నా, రూపరేఖ లెలాగున్న ఫరవాలేదు.

కాని రాఘవరావు పుత్రుడు శేఖర్ ఉద్దేశం వేరే విధంగా వుంది. అతడికి

అందం మీదున్న కాంక్ష, డబ్బుమీద లేదు. ఓ ఆదివారం వాడు కలకత్తాలో పారడైజ్ సినిమాలో ఓ తెలుగు సినిమా మేటనీ షో వేసారు. హోటలు రూములో ఉబుసుపోక సినిమాకి వచ్చాడు విరామ సమయంలో లాబీలో నించుని టీ త్రాగుతున్నాడు మరో ప్రక్క దూరంగా ఇద్దరమ్మాయిలు టీ త్రాగుతున్నారు. అందులో ఒక అమ్మాయి చాలా బాగుంది. పచ్చని శరీరం, సమమైన ఒత్తు, ఎత్తుకుతగ్గ లావు మరుకైన పెద్ద కళ్ళు, పుష్టిగా ఆరోగ్యంగా ఉన్న అవయవ పొందిక గల ఆ అమ్మాయి శేఖర్‌ని బాగా ఆకర్షించింది. ఆ అమ్మాయి గులాబి రంగు షిఫాన్ చీర, కాస్త ముదురు రంగు లోకట్ స్లీవ్‌లెస్ రవిక కట్టుకుంది చీర, రవిక ఒంటికి అంటుకున్నాయి అందంగా. శేఖర్ ఆ అమ్మాయి నుంచి కళ్ళు త్రిప్పుకోలేక పోయాడు.

సుశీల అడిగింది— "ఏయ్ జానకి ! ఏమిటి సంగతి ? ఆ అబ్బాయి నీకు తెలుసా యేమిటి? అంతగా నిన్ను కళ్ళతో త్రాగేస్తున్నాడు."

జానకి శేఖర్‌ని శ్రద్ధగా చూసింది. ఇద్దరి కళ్ళూ కలిసాయి. జానకి మనస్సు శేఖర్ రూపాన్ని మెచ్చుకుంది.

జానకి - "అతడు త్రాగుతున్నది నన్ను కాదే, వేడి టీని."

సుశీల - "అది సరేగాని, ఈ వ్యవహార

**జరిగిన కథ 6** విమలమ్మ భర్త గోపాలం బ్యాంకులో చీఫ్ అకౌంటెంటుగా పని చేస్తుంటాడు. వీరి పిల్లలు భాస్కర్, కోమలి. గోపాలం బావ రాఘవరావు విలాస పురుషుడు. ఉద్యోగంలో చేరిన దగ్గర్నుండి గోపాలం కూడబెట్టిన డబ్బును వ్యాపారంలో నష్టమొచ్చిందనే నెపంతో రాఘవరావు నోటు వ్రాసి తీసుకుంటాడు. గోపాలం అప్పు బలరాం కూతురు లక్ష్మి రామునాయుడిని ప్రేమిస్తుంది. అతనితో 'లేచి'పోతూ ఉత్తరం వ్రాసి పెట్టి పోతుంది. ఓ యాక్సిడెంట్‌లో గోపాలం మరణిస్తాడు. అతనికి వెనక తను వ్రాసిచ్చిన నోటును అపహరిస్తాడు రాఘవరావు. విమలమ్మ ఇంటిలో తనకుటుంబంతో అద్దెకుంటున్న ధనంజయరావు ఆమెను బలాత్కారం చేయబోగా, అతనిని ఇంటినుండి గెంటివేస్తుంది. మొదటినుంచి అనుకుంటున్నట్లుగా, తన కూతురు కోమలిని శేఖర్‌కిచ్చి మేనరికం చేద్దామని అడగడానికి వచ్చిన విమలమ్మను రాఘవరావు అవమానిస్తాడు. తన మేనమామ విశ్వనాథం కూతురు సరోజని కాదని, తన ప్రక్క వాటాలో అద్దెకుంటున్న జనార్దనస్వామి కూతురు శ్రీదేవిని ప్రేమించి పెండ్లి చేసుకొని ఆమె ద్వారా టాటా నగర్‌లో వచ్చిన ఉద్యోగంలో చేరాడు భాస్కర్. బలవంతం చేయబోయిన సత్యానికి తగినబుద్ధి చెబుతుంది కోమలి.

మేదో మొదటి చూపులోనే ప్రేమలాగుంది. కుర్రాడు చిరగా బుర్రగా ఉన్నాడు. చదువుకుని ఉంటాడు. పాపం! ఒకసారి వెళ్ళి పలకరించవే. అతడి బాధ చూస్తుంటే నాకు జాలి వేస్తోంది."

"అయితే నేను వెళ్ళి అతడ్ని పలకరించి పొడలకొట్టించేద్దునా— చెప్పు?"

"బడాయి చెప్పకే జానకీ! ఏదీ చూద్దాం! ధైర్యముంటే అలా చెయ్యి."

జానకి, సుశీల తనవైపు చూసి ఏదో మాట్లాడుకోడం చూశాడు శేఖర్. ఇంకా దిక్కువగా చూస్తే బాగుండదని దూరంగా పోయి విల్సు సిగరెట్టు ముట్టించాడు. కాని మనస్సుండబట్టడం లేదు. మళ్ళీ అటు తిరిగి జానకిని చూడడం మొదలెట్టాడు.

"మళ్ళీ చూపులు విసురుతున్నాడోయ్! సరే టెస్టు" అని జానకి గబగబా నడుస్తూ శేఖర్ దగ్గరకు వచ్చింది. సుశీల జానకిని అనుసరించింది.

"ఏమండీ— ఏమిటి సంగతి? పది నిముషాల్నించి చూస్తున్నాను, మీరు రెప్ప వాల్చకుండా అదేపనిగా చూస్తున్నారు— ఏం కథ?" అని కోపం నటిస్తూ అడిగింది జానకి.

శేఖర్ ఆ అమ్మాయి కళ్ళలోని చిలిపిదనాన్ని కనిపెట్టాడు.

"మరేం లేదు— మీరు చాలా అందంగా ఉన్నారు, అందుకే చూస్తున్నా. అది తప్పు పనాండీ?" అమాయకత అభినయిస్తూ అడిగాడు.

"మిస్టర్! మీరు చదువుకున్నారా? మీకు సభ్యతంటే ఏమిటో తెలుసా?"

"సభ్యతా! అది నేను మిమ్మల్ని అడగాలి."

"మమ్మల్నా!" ఇద్దరమ్మాయిలూ చాలా ఆశ్చర్యపోయారు.

"అవును— మీ అందాన్ని చూసి నేను ఆనందిస్తుంటే, ఇలా మీరు వచ్చి నా తపస్సును భగ్నం చేయడం సభ్యతగా ఉందా? మీకు నేనేమీ హాని కల్గించలేదే!"

జానకి విస్తుపోయింది. సుశీల సర్ది చెప్పింది— "పోనీలేవే— ఎవరో పిచ్చివాడు లాగున్నాడు. పోదాం పద, పిక్చరు మొదలెడుతున్నారు."

ఇద్దరమ్మాయిలు లోపలికి వెళ్ళిపోయారు.

మరోనాడు దిస్సోడలో ఏదైనా తెలుగు పుస్తకం కొందామని శేఖర్ వెళ్ళాడు. యువ దీపావళి సంచిక ఒకటి ఉంది. మరో తెలుగు పుస్తకం లేదు. ఒక అమ్మాయి అది వంగి తీసుకునేలోపల చటుక్కున శేఖర్ ఆ ఒక్క పుస్తకం తీసుకున్నాడు. ఇద్దరూ ఒక్కసారే వంగడంవల్ల రెండు తలలూ ఫట్ అయ్యాయి.

"ఏయ్ మిస్టర్! కాస్త చూసుకొని లేవూ?" తీక్షణంగా చూస్తూ జానకి అడిగింది. అప్పుడే శేఖర్ జానకిని చూశాడు. హృదయం ఆనందంతో నిండిపోయింది.

"మీరా! క్షమించాలి, నిజంగా చూడలేదు." అని పుస్తకాల వాడికి అయిదు రూపాయల నోటు ఇచ్చేసి పేజి పరధ్యానంగా తిరగవేయసాగాడు.

"అవుర్ కూచ్ తెలుగు కితాబ్ హై" పుస్తకాలవాడ్ని జానకి అడిగింది.



## జీవితగమ్యం

"ఓహి డన్స్ వట్ థింక్ హౌగయ రీక్ కిత్ వర్త్ మగర్ ఓఫ్ ఓ పాట్ అఫీ అఫీ లెగయా" అని వాడు అదుబు చెప్పాడు. శేఖర్ విన్నాడు.

"పోనీండి— మీరు మరోలాగను కోకపోతే ఈ పుస్తకమే మీరు తీసుకోండి"

"చాల థాంక్సండీ ఇవ్వండి గాని మీకు ఇబ్బంది కలుగుతుందేమో" ఇలా మాట్లాడుతూ ప్రక్కనున్న పార్కు వైపు అనుకోకుండానే నడవడం మొదలెట్టారు.

"ఫరవాలేదు. మీ ఆనందమే నా ఆనందం" అని చిలిపిగ జానకి కళ్ళలోకి చూసేడు. జానకి కొంచెం సిగ్గుపడింది. శేఖర్ జేబులోంచి కలంతీసి పుస్తకం మొదటి పేజీలో 'అభినందనలతో — మిత్రుడు శేఖర్' అని వ్రాసి పుస్తకాన్ని అందించాడు. జానకి పర్సులోంచి అయిదు రూపాయలు తీసి అందివ్వబోయింది.

"సారీ, పుచ్చుకోలేను. అది చూడండి" అని తను వ్రాసినది చూపెట్టాడు.

"అసలేం బాగులేదండి."

"ఏమిటి! నేనలా వ్రాయడమా?"

"కాదండి మీరు నా దగ్గర డబ్బు తీసుకోకుండా ఇవ్వడం."

"దాని విలువకన్నా ఎక్కువే నాకు ముట్టింది కదండీ."

"ఎలా?" కళ్ళు పెద్దవి చేసి అమాయకంగా ప్రశ్నించింది జానకి.

"మీతో మాట్లాడగల్గేను. మీ ప్రక్కన నిల్చున్నాను. ఇంతకన్నా విలువైన అనుభూతి ఎన్ని పుస్తకాలు చదివితే లభిస్తుంది చెప్పండి."

"మీరు చాల మాటకారులే."

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్."

"పోనీండి — మీకో కప్పు కాఫీయైనా ఇప్పించండి." నవ్వుతూ అంది జానకి.

"హోటల్లోనా? మీ ఇంట్లో ఇప్పిస్తే చాల సంతోషిస్తాను."

"అది తరువాత, ప్రస్తుతానికి హోటల్లోనే."

ఇద్దరు మెట్రో సినిమా హాలు ప్రక్కనున్న సౌత్ ఇండియా కాఫీ హోటల్లోకి వెళ్ళి దోసె, కాఫీ తీసుకున్నారు. బిల్లు శేఖర్ చెల్లిస్తానంటే జానకి ఒప్పుకోలేదు.

ఆవె వెలించింది. మళ్ళీ ఇద్దరూ పెట్టెలోకి వచ్చి కూర్చున్నారు.

"మీ పేరు చెప్పారు కాదు?"

"నా పేరు మీరడగలేదుగా."

"ఇప్పుడడుగుతున్నా చెప్పండి?"

"జానకి."

"చాల అందమైన పేరు - మీలా."

"ఇది ఏ సినిమాలోని డైలాగ్!"

ఇద్దరూ హాయిగ నవ్వుకున్నారు.

"మీరడగకపోయినా నేను చెప్తున్నా — అది నా బాధ్యత గనుక. నా పేరు చంద్రశేఖర్. బి. ఇ. మెకానికల్ ఇంజనీరింగు. వయస్సు ఇరవైఆరు సంవత్సరాలు. ఈ పట్టణంలోని "హాబికేటర్స్" కంపెనీలో స్ట్రక్చరల్ ఇంజనీరుగ సంవత్సరం నుంచి పని చేస్తున్నా. నెలకు ఆరువందలయాభై రూపాయలు ప్రస్తుత జీతం అంతా కలిపి. మా ఊరు విశాఖపట్నం. మరి మీ బయోడేటా చెప్పారు కాదు."

"ఏం, ఏదైనా ఉద్యోగ మిప్పిస్తారా?"

"ఇప్పించడమేంఖర్మ - నేనే ఇస్తా." అని నవ్వుతూ జానకి కళ్ళలోకి చూసాడు. జానకి కాస్త అర్థమై సిగ్గుపడింది.

"అలాగా! అయితే వినండి. నా పూర్తి పేరు కొల్లేటి జానకీదేవి. బి. ఎస్. సి. వయస్సు ఇరవైరెండు. ఇంకా ఉద్యోగం సద్యోగంలేదు. హాబీ — ఇలా ఊరిమీద పడి పుస్తకాలు కొనడం, చదవడం, సినిమాలు చూడడం. మా నాన్నగారు ఇన్‌కంటాక్సు ఆఫీసరు - పేరు ఈశ్వరయ్య. వివాహం పెండింగ్."

"చాలా సంతోషం. మీకు అన్ని యోగ్యతలున్నాయి. తప్పకుండా మీకు ఉద్యోగం ఇస్తాను — గాని ఇచ్చేముందర మీ నాన్నగార్ని కలియాలి."

"ఏంసార్, ఏమైనా లంచమిచ్చుకోవాలా?"

"లంచం ఇప్పుడివ్వక్కరలేదు - ఉద్యోగం ఇచ్చింతరువాత మీ నాన్నగారు కాదు మీరే ఇచ్చుకోవాలి."

"అలాగా — అప్పుడు చూద్దాం ఎవరు ఎవరికి లంచమివ్వాలో."

ఇద్దరు పరస్పరం అర్థం చేసుకొని ఆనందంగా నవ్వుకున్నారు.

అలా వాళ్ళిద్దరకు పరిచయం కల్గి, ఇద్దరు ఊహలు కల్సి, మంచి స్నేహితులుగా మారి ఓ ఆరు నెలలు గడిచేసరికి వివాహ ప్రస్తావన వరకు వ్యవహారం వచ్చింది. శేఖర్ జానకి ఇంటికి చాలాసార్లు వెళ్ళాడు. ఈశ్వరయ్యగారు వాళ్ళ స్నేహాన్ని అమోదించారు. శేఖర్ వంటి యోగ్యుడు, అందమైనవాడు తమకు అల్లుడుగా దొరుకుతున్నందుకు జానకి తల్లిదండ్రులు చాల సంతోషించారు. ఈశ్వరయ్య చాలా నిజాయితీగల ఆఫీసర్. స్ట్రిక్ట్ ఆఫీసరని చాల మంది భయపడుతూంటారు.

శేఖర్ తన తల్లిదండ్రులకు ఉత్తరం వ్రాసాడు, తనకు కలకత్తాలో ఓ అమ్మాయి నచ్చిందని, ఆ పెండ్లి మాట్లాడడానికి ఇద్దర్ని రమ్మనమని. రాఘవరావుకి గుండె అదిరే పనయింది. మూడు రోజులలో రాఘవరావు, కాంతం వచ్చారు. ఈశ్వరయ్య ఇంటికి వెళ్ళి అమ్మాయిని చూసారు.

పడుతుంది.' శేఖర్ సంసారమలా గుండేది.

ఈ విషయం రఘువరావుని చాల క్రుంగదీసింది. కొడుకు తను వాడు కాకుండా పోయేడని. కనీసం తను గాని, తన భార్య గాని పిల్లలుగాని కొడుకు దగ్గర పది రోజులుండడానికి ఆస్కారం లేకుండాపోయిందని విచారించాడు. కొడుకుని పెంచి, విద్యాబుద్ధులు నేర్పి, పెద్దవాడ్ని ప్రయోజకుడ్ని చేసి యవ్వనం రాగానే ఓ కోరకరాని కొయ్యకు సర్వహక్కులతో దానం చేసినట్లుంది. కనీసం వాడిని అమ్మినా అంత విచారముండకపోను. కాని రఘువరావు కొడుకుని అమ్మి కట్నం పుచ్చుకోలేకపోయాడు మరి. అటువంటి సమయాల అనుకునేవాడు 'మేనరికం చేసుంటే ఎంత బాగుండేది' అని. కోమలి చాల అందమైంది. జానకిలా షోకులు లేకపోయినా చాల మంచపిల్ల. తనే పెద్ద పొరబాటు చేసాడు ఆ నిర్భాగ్యురాలైన విమలమ్మ శాపమే తన్నివిధంగా వేధిస్తూందని అనుకున్నాడు.

ఒకసారి రఘువరావు, కాంతం కొడుకు దగ్గరకు కలకత్తా వెళ్ళారు. జానకి మళ్ళీ వంకరగ ప్రవర్తించడం మొదలెట్టింది. ఘటికుడైన రఘువరావు కూడా ఆమె జాడ్యాన్ని పోగొట్టలేక పోయాడు. కోపం వచ్చి తగవు పెట్టుకున్నాడు. కోడలు అలిగి గదిలోకి పోయి పడుకుంది. కొడుకుని పిలిచి రఘువరావు నానామాటలు అన్నాడు.

''ఒరే శేఖర్! నువ్వింత దద్దమ్మవైనావేమిరా— నీ పెండ్లానికిదేం పోయే కాలంరా? ఇంటికి నీవాళ్ళెవరు వచ్చినా దెయ్యం పడుతుంది. దాని రోగం ఎంతగా ముదిరిపోయిందంటే నీ తల్లి సోఫాలో కూర్చుంటే సోఫా పాడైపోతుందిట. నీ తల్లి డైనింగ్ టేబిల మీద భోజనం చేస్తే టేబిలు అసహ్యంగ ఐపోతుందట. ఆఖరికి నీ తల్లి వంటగదిలోనికి వాడా వెళ్ళాడట. నేన్నీ అమ్మ వంటగదిని చిందరవందర చేసేస్తుందట నేను, నువ్వు భోజనం చేస్తే నీ ఎంగిలి కంచాన్ని అక్కడ నుండి తీస్తుందిగాని నా కంచాన్ని తియ్యదు తనకి అసహ్యమట. పని మనిషి వచ్చేవరకు, లేక మీ అమ్మ తీసేవరకు ఆ కంచమలా ఉండాల్సిందే ఏమిరా, మొగవాడివి కావూ? నీ భార్యను నీ అదుపులో ఉంచుకోలేవూ?''

''నాన్నా! మీరు చెప్పినవన్నీ నిజమే! నే నొప్పుకుంటాను— కాని దాని ఈ మనో రోగాన్ని పోగొట్టడం నా తరం కాదు. అలాగని నేను జానకిని వదులుకోలేను కదా. జానకంటే నాకెంతో ప్రేమ. అందుచేత ఈ ఇంట్లో శాంతికోసం నేను జానకితో పోట్లాడను. మీరంతా వెళ్ళిపోగానే జానకి నాతో ఎంత ప్రేమగా ఉంటుందంటే, ఏ భర్తా తన భార్యవల్ల అంత అనురాగం, అంత ఆప్యాయత పొందలేడు. ఆ ఆనందాన్ని నేను వదులుకోలేను. ఇట్లాంటి పరిస్థితులలో నన్నేమి చెయ్యమన్నారు చెప్పండి?''

ఈ మాటలన్నీ ప్రక్క గదిలోంచి వింటున్న జానకి కళ్ళు గర్వంతో, పంతంతో, అహంతో మిలమిల లాడాయి. శేఖర్ ఎప్పటికి తనవాడేనన్న ధైర్యం కలిగింది.

''నువ్వేమి చెయ్యనక్కరలేదురా— పెండ్లాన్ని గదమాయించలేని చవటవని నాకు తెల్సురా — నీ పెళ్ళాం మూలాన్న నీతో బాంధవ్యం తెంపుకోలేము గనుక నువ్వే నీ భార్య దర్శనం అనుమతి తీసుకుని అప్పుడప్పుడు మా యింటికి వస్తూండు.''

అనాడే రఘువరావు భార్యను తీసుకుని విశాఖపట్నం వెళ్ళి పోయాడు.

[ఇంకా వుంది]



# వంటలు

## మసాలా బెండకాయ

కావలసినవి : బెండకాయలు - అరకిలో, ఉప్పు - 1 టేబిల్ స్పూన్, పసుపు - అర చెంచా, మిరప పొడి - అరచెంచా, ధనియాల పొడి - 1 చెంచా, పచ్చి మిరపకాయలు - 2, నూనె - 2 చెంచాలు.

చేసే విధానము : బెండకాయలు కడిగి చిన్న ముక్కలుగా తరగవలెను. పచ్చిమిరప కాయలు కూడా తరుగుకోవాలి. నూనెను కాగనిచ్చి అందులో బెండకాయలు, మసాలా వేసి కలియ బెట్టాలి. మూత పెట్టి సన్నటి సెగమీద సుమారుగా అరగంట సేపు వేగించాలి. వేయించే ముందు వీనిలో ధనియాలపొడి, మిరపపొడి, ఉప్పు, పసుపు, తరిగిన పచ్చిమిరప కాయ ముక్కలు వేసి వేయించాలి. అరగంట తరువాత దింపుకొని వడ్డించుకోవచ్చు.

— పి. సుధారాణి



## పనస తొనల అప్పడాలు

కావలసిన వస్తువులు : దోరగా ఉన్న పనసతొనలు 25, ఎండుమిరపకాయలు 6, కొబ్బరినూనె ఇంగువ, జీలకర్ర 1 స్పూన్, ఉప్పు తగినంత.

చేసే విధానం : మొదట పనసతొనలను చిన్న చిన్న ముక్కలుగా చేసుకోవాలి. ఈ ముక్కలను ఒక గిన్నెలో వేసి, కొద్దిగా నీరు పోసి ఉడకబెట్టాలి. కొద్దిగా ఉడుకుతూనే గిన్నెను క్రిందకు దించి, నీటిని వడబోసి, పనస ముక్కలను ఒకప్లేటులో తీసుకోవాలి.

ఎండుమిరపకాయలు, ఇంగువ, ఉప్పు, పనసతొనల ముక్కలు వీటి నంతటినీ రోటిలో వేసి మెత్తగా రుబ్బుకోవాలి. వెడల్పాటి ప్లాస్టిక్ గుడ్డపై కొబ్బరినూనె రాసి రుబ్బిన పదార్థాన్ని సమాన భాగాలుగా తట్టి ఎండలో బాగా ఎండనివ్వాలి. బాగా ఎండిన తర్వాత ప్లాస్టిక్ గుడ్డ నుంచి తీసి, మనకు నచ్చిన సైజులో కట్ చేసుకోవాలి. కావలసినప్పుడు నూనెలో వేయించి తింటే ఎంతో రుచికరంగా ఉంటుంది. మరలా మరలా తినాలనిపిస్తుంది.

— కె జి. హేమలత *

**శ్రీ గిరి కాలధర్మానికి సంతాపం :**

మాజీ రాష్ట్రపతి భారతరత్న శ్రీ వరాహగిరి వెంకటగిరి కాలధర్మానికి దేశ ప్రజలందరితోపాటు జంట నగరాల పౌరులుకూడా చాల దుఃఖించారు. శ్రీ గిరిని దేశ కార్మికోద్యమ పితామహుడని కీర్తించవచ్చు. విశేషంగా, పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలోని కార్మికోద్యమంతో ఆయనకు సన్నిహితత్వం ఉంది. ఆయనను 1941లో నిజాం స్టేట్ రైల్వే సంఘంవార్షికోత్సవానికి అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. కాని సికిందరాబాద్ మేజిస్ట్రేటుగారు వార్షికోత్సవాన్ని నిషేధించారు. శ్రీ గిరి సికిందరాబాద్‌లో ప్రవేశించరాదని ఉత్తర్వులు జారీ చేశారు. శ్రీగిరి మేజిస్ట్రేటు ఉత్తరువులను ఉల్లంఘించాలనుకున్నారు గాని, రైల్వే సంఘం కార్యవర్గ సభ్యులు వద్దన్నారు. సర్ మీర్జా ఇస్మాయిల్ హైదరాబాద్ రాష్ట్రానికి ప్రధానిగా ఉన్నప్పుడు కార్మిక సమస్యలను గురించి, ఉద్యోగావకాశాలను గురించి ప్రభుత్వానికి సలహాలివ్వడానికి గౌరవ సలహాదారుగా ఉండాలని శ్రీ గిరిని కోరారు. కాని, ఆయన నిరాకరించారు. శ్రీ గిరిని తలచుకొన్నప్పుడల్లా నాకు ఆయన సహాయ నిరాకరణోద్యమంలో తరచు చెబుతున్న మాటలు జ్ఞాపకం వస్తాయి. ఆయన చేతులు చాచి "స్వరాజ్యం వస్తే ప్రతివాడికీ ఇంత అన్నం, ఇంత పప్పు" అంటూ, దోసిలి పట్టి "ఇంత నెయ్యి" అనే వారు. [ఇప్పుడు ప్రజాస్వామ్యానికి ఒక మిళ్లగరిటె నెయ్యి కూడా లభించడం లేదు] శ్రీ గిరి ఒరిస్సా రాష్ట్రంలోని బరంపురంలో 1894 ఆగస్టు 10వ తేదీన జన్మించారు. ఆయన తండ్రి శ్రీ జోగయ్య పంతులు పేరు మోసిన న్యాయవాది. అప్పటి కేంద్ర శాసనసభలో సభ్యులు. శ్రీ గిరి కళ్లికోట కాలేజీలో పట్టభద్రుడయిన తర్వాత, ఇంగ్లాండులోను, ఐర్లాండులోను న్యాయశాస్త్రం చదివి, డబ్లిన్ విశ్వవిద్యాలయంనుంచి బార్-ఎట్-లా అయ్యారు. ఐర్లెండులో విద్యార్థిగా ఉన్నప్పుడు, తర్వాత అధ్యక్షుడయిన డివెలరాతో కలిసి సిన్‌ఫెన్ ఉద్యమంలో పాల్గొన్నారు. దాని ఫలితంగా ఆయనను 1916 జులై 1వ తేదీన బ్రిటన్ నుంచి బహిష్కరించారు. భారతదేశానికి వచ్చిన పిదప ఆయన భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. హోం రూల్ ఉద్యమంలోను, సహాయ నిరాకరణోద్యమంలోను పాల్గొన్నారు. 1921లో న్యాయవాద వృత్తిని వదిలి పూర్తిగా కార్మికోద్యమానికి జీవితాన్ని అంకితం చేశారు. శ్రీ ఎన్. ఎం. జోషితో కలిసి కార్మికోద్యమాన్ని ప్రవర్తింపజేశారు. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ స్థాపకులలో ఒకరయ్యారు. దానికి రెండుసార్లు అధ్యక్షులుగాను ఉన్నారు. అఖిల భారత రైల్వే కార్మికుల సంఘ సమాఖ్యను స్థాపించి, దానికి ఏడు సంవత్సరాలపాటు కార్యదర్శిగాను, ఏడు సంవత్సరాలపాటు అధ్యక్షుడుగాను ఉన్నారు. 1927లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సంస్థ మహాసభలో భారత ప్రతినిధిగాను, 1931లో లండనులో జరిగిన రవుండ్ టేబిల్ మహాసభలో భారత కార్మిక ప్రతినిధిగాను పాల్గొన్నారు. 1934

# హైదరాబాదు నోట్‌బుక్

1937లో అప్పటి కేంద్ర శాసనసభలో సభ్యులుగా ఉన్నారు. 1936లో జరిగిన సాధారణ ఎన్నికలలో అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి బొబ్బిలి రాజును



అనాయాసంగా ఓడించి శ్రీ రాజగోపాలాచారి స్థాపించిన మొదటి కాంగ్రెస్ మంత్రివర్గంలో కార్మికశాఖా మంత్రిఅయ్యారు. పిదప శ్రీ ప్రకాశం మంత్రివర్గంలో కార్మిక శాఖామంత్రిగా ఉన్నారు. స్వాతంత్ర్య సంపద తర్వాత లంకలో భారత హైకమీషనరుగా నియమితులయ్యారు. 1952లో జరిగిన తొలి సాధారణ ఎన్నికలలో పాతపట్నం నియోజక వర్గం నుంచి లోకసభకు ఎన్నికయి, కేంద్ర ప్రభుత్వంలో కార్మిక మంత్రి అయ్యారు. బ్యాంక్ అవార్డుపై అభిప్రాయభేదాలు ఏర్పడడం వల్ల మంత్రి పదవికి రాజీనామా చేశారు. ఉత్తరప్రదేశ్, కేరళ, కర్నాటక రాష్ట్రాలకు గవర్నర్‌గా పని చేశారు. 1967లో భారత ఉప రాష్ట్రపతిగా ఎన్నికై, రెండేళ్లలోగా రాష్ట్రపతి డాక్టర్ జకీర్ హుస్సేన్ మరణం వల్ల తాత్కాలిక రాష్ట్రపతిగా బాధ్యతలు స్వీకరించి, ఆ పదవిని పరిత్యజించి "ఆత్మ ప్రబోధంతో" రాష్ట్రపతి పదవికి శ్రీ సంజీవరెడ్డితో పోటీ చేశారు, గెలిచారు. ఐదేళ్లపాటు రాష్ట్రపతి పదవిని నిర్వహించిన పిదప ఆయన ఊరికే ఉండలేదు. ఇండియన్ లేబర్ పార్టీ అనే కొత్త పార్టీని స్థాపించి, దాని అభివృద్ధికి అహర్నిశం పరిశ్రమించారు. కాలధర్మం చెందడానికి రెండు రోజులకు ముందు భారత రాజ్యాంగం మార్చడానికి కొత్త రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటు చేయాలని ప్రధాని శ్రీమతి గాంధికి ఉత్తరం వ్రాశారట. జూన్ 24వ తేదీ ఉదయం నిత్యకృత్యాలు తీర్చుకొని, తనకు ప్రియమైన, జీవిత లక్ష్యమైన కార్మిక సమస్యను తన కుమారునితో చర్చించి అనాయాసంగా కన్నుమూశారు, ధన్యజీవి శ్రీ వి.వి. గిరి. అగర్భశ్రీమంతుడై పుట్టారు. జీవితమంతా ఉదాత్తంగా గడిపి, ఉన్నత పదవులు నిర్వహించి, అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు పదవులుపట్టుకొని వేలాడక నిర్భయంగా పరిత్యజించిన ధీరుడు శ్రీ గిరి. ఈ పట్టువిడుపులు, నిర్భీకత, లక్ష్య పరమార్థ దృష్టి నేటి యువకులకు, ముఖ్యంగా రాజకీయ వాదులకు అబ్బాలి.

**ఉపశ్రుతి :**

"ఇదేమిటి సార్ అన్యాయం! ఒక శుభం జరిగితే, వెంటనే ఏదో అశుభం జరుగుతుందే!" అన్నాను ఒక దైవజ్ఞునితో. "అయ్యా! సుఖ దుఃఖాలు విడదీయరాని ద్వంద్వాలు. సూర్యుని వెంట ఛాయలాగ సుఖాన్ని దుఃఖం వెన్నాడే ఉంటుంది. ఒక రాజయోగంతోపాటు పక్కనే ఏదో కొరత ఉండనే ఉంటుందని జ్యోతిర్వేదం చెబుతున్నది" అని అన్నాడా దైవజ్ఞుడు.



# వారఫలం

## 25–7–1980 శుక్రవారం మొదలు 31–7–1980 గురువారం వరకు

మేషం:— అనేక విధాల యోగ దాయకమైన వారం. ధనాదాయం గలవారం. ఉద్యోగ వృత్తులందు అభివృద్ధి గలవారం. క్రీడారంగ విశేషం, నూతన వస్తు సేకరణకు అనుకూలంగా, ఆనంద దాయకంగా కాలం గడిపేందుకు అనుకూల గ్రహస్థితి గలదు. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు అభివృద్ధి సూచన గలదు. కొందరకు 'ప్రమోషన్' లభింపవచ్చు.

వృషభం:— మీ మీద ఈ వారం బుధ గ్రహానుకూలత గలదు. రవిప్రభావం కూడా అధికమే. వాద ప్రతివాదాలలో జోక్యం కూడా కలుగచేసికొంటారు. ఆ వాదన మీకు అనుకూలమే. వ్యవసాయ రంగంలో మీరు కొన్ని మార్పులు గావింపనున్నారు. అనుకూలదాయకమని గ్రహించాలి. వారమంతా మీకు తోచినట్లు చేయండి. స్త్రీలకు: అవసరాలకు ధనం చిక్కటమే గాక, కళా రంగ ఖ్యాతి కూడా గలదు.

మిథునం:— వారంతంలో మీకు ధనాదాయం గలదు. పరులెవరో, అయిన వారెవరో గుర్తించి మెలగండి. ఉద్యోగ వృత్తులందు, కొంత అననుకూలత సంభవించ గలదు. అందువల్ల జాగ్రత్తగా ఉండాలి. ఆరోగ్య విషయంలో, వయసు మీరినవారు, జాగ్రత్త పడాలి. స్త్రీలకు: ఆరోగ్య లోపం రావటమే గాక, ధనలోపం కూడా గలదు.

కర్కాటకం:— గ్రహబలం అధికం. వ్యాపారానుకూలత గలదు. వ్యవసాయ రంగంలో అనుకూల మార్పులు చేయనున్నారు. ఉద్యోగంలో ఇబ్బంది రాకుండా చూసుకోండి. కృషిచేసి, సామాన్య లాభం వ్యాపార రంగంలో సాధించండి. ప్రయాణం చేయవలసి రావచ్చు. జరుగుతుంది. స్త్రీలకు: వృత్తి, ఉద్యోగం సర్వానుకూలం. లాభది గలవారం.

సింహం:— ఆనందంగా వారం గడపాలని కాంక్షిస్తారు. గాని, ఏదో విధంగా మీకు మానసికంగా బాగుండక పోవచ్చు. ఇంటి విషయాలలో శ్రమ కల్గుతుంది కూడా. క్రయ విక్రయములలో ఇబ్బంది కలుగనున్నది. జాగ్రత్త! జంతువుల మూలాన ప్రమాదమో, వాహన ప్రమాదమో సంభవించనున్నది. జాగ్రత! స్త్రీలకు అధిక వ్యయం, కార్యభారం, వారాంతంలో స్వల్పాదాయం ఉండగలదు.

కన్య:— ఈ వారం, మీరు ప్రారంభించిన వ్యాపారంలో కొంత అనుకూలత కలదు. గాని అది జాయింటు వ్యాపారమైతే, కొంత ఇబ్బందికల్గుతుంది. ఉద్యోగంలో శ్రమ కలిగే గ్రహ స్థితి గలదు. స్త్రీలకు: కళారంగ ఖ్యాతి, కించిత్తు ఆదాయం, ఆటపాటల్లో అనుకూలత గలవారం.

తుల:— శుక్ర గ్రహానుకూలత గలవారం. ఆనందంగా వారం గడిపే మార్గమున్నది. విందు వినోదాలతో కాలక్షేపం చేయనున్నారు. నూతన వస్తు సేకరణకు అనుకూలత గల వారం. ఉద్యోగ వృత్తులలో అభివృద్ధి గలవారం. రచనా వ్యాసంగంలో చాలమందికి సఫలితముండ గలదు. స్త్రీలకు: ధనాదాయం గలవారం. కళారంగ ఖ్యాతి, ప్రయాణానుకూలత గలవారం.

వృశ్చికం:— వారంలో ఏదో ఇబ్బందికి గురి కానున్నారు. రావలసిన ధనం సమయానికి రాక పోవచ్చు. బాకీలు వసూలు కాక పోవటం కూడా గమనించగలరు. ఇతరులకు సహాయం చేయ బోయి ఇబ్బందికి గురి కాగలరు. స్వశక్తితో మీరు గావించే కార్యాల మూలాన మీకు ద్రవ్యాదాయం సంభవం. స్త్రీలకు: వినోద విజ్ఞాన కాలక్షేపాల్లో పాల్గొంటారు. చుట్టుప్రక్కలవారితో గొడవలు రావచ్చు. తగుజాగ్రత్తవహించాలి.

ధనుస్సు:— వారారంభంలో దూర బంధువులు, మిత్రులు ఇంటికి చేరనున్నారు. ఆతిథ్యంతో సతమతం కావటం, అధికంగా వ్యయం చేయవలసి రావటం గమనిస్తారు. ఉద్యోగ వృత్తులలో మీకు అనుకూలత గల్గి, స్వల్పంగా ఆదాయం కూడా సంభవించనున్నది. ఈ రాశికి సంబంధించిన 'మూలా' నక్షత్ర జాతకులకు లాభం కలుగ నున్నది. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులు బాగుంటాయి. కళారంగ ఖ్యాతి కూడా అతిశయించగలదు.

మకరం:— ఏ వృత్తిలో వారైనా, ఏ వ్యాపారం చేసే వారైనా, ఏ రంగంలో మీకు పరిచయమున్నా, ఈ వారం మీకు లాభదాయకమే. ఉత్తర ప్రత్యుత్తరాల మూలాన కొన్ని ముఖ్యవిషయాలు తెలిసికోగలరు. దైవ కార్యం నెరవేర్చుటకో, శుభ కార్య విషయాలు నెరవేర్చుటకో, బంధువులతో చర్చలుగావింప నున్నారు. స్త్రీలకు: విందు వినోదాల్లో పాల్గొనటం, లాభదాయకంగా పరిణమించగలవారమ్.

కుంభం:— ముఖ్యబంధువులు ఇంటికి రాగలరు. గృహ నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులు కాగలరు. భారీ వ్యాపారంలో చాలమందికి అనుకూల వారం. బంధువులకు తప్పనిసరిగా సహాయం చేయవలసి వస్తుంది. అధిక వ్యయం కూడా కనిపించ గలవారమే. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు పొరపాట్లు దొర్ల గలవు. జాగ్రత్తగా కృషి చేయుటం అవసరం.

మీనం:— త్వరపడి మీరు గావించిన పనులలో నష్టం రావచ్చు. కారణం, వెనుక ముందులు ఆలోచించక కార్యరంగానికి దిగటమే. వైద్యులకు, చిన్న ఉద్యోగాలతో సంబంధమున్న వారికి అనుకూలమైన వారమే. స్త్రీలకు: కళారంగ ఖ్యాతికితోడు నూతన వస్తు, వస్త్ర సేకరణ కూడా ఉండగలదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**



"గూటిలోని రామచిలక"లో సరిత

# తారలకు తార

"మామిడికాయ పచ్చడి అంటే ఇష్టం లేనిదెవరికి?
'ప్రియ' మామిడికాయ పచ్చడి అంటే
నాకు మరీ మరీ ఇష్టం." ...జయప్రద

ఇంట్లో చేసినంత జాగ్రత్తగా-స్వచ్ఛమైన నూనె, మేలైనమసాలాలు తగుపాళ్ళలో మేళవించి చేసిన 'ప్రియ' మామిడికాయ పచ్చడి రుచిని మీరెంతో అభిమానిస్తారు.

మీరు కోరే పలురకాల్లో
•మామిడికాయ•నిమ్మకాయ•టమాటో•అల్లం•గోంగూర.

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

KIRON/PF/807

**ప్రియ ఫుడ్స్** ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
Margadarsi
Marketing PRIVATE LIMITED

